# గజేంద్రమోక్షము

(టీకాతాత్పర్య సహితము)



వేంకట్రామ అండ్ కో.,

విజయవాడ - మద్రాసు - కర్నూలు



వెల రు 0-10-0

# పీఠిక

ఈ గజేంద్రమోక్షము శ్రీవేదవ్యాసరచితమైన భాగవతము నందు అష్టమస్కంధములోనిది. సంసారక్లేశములతో సతమతమగుచున్న మానవకోటి నుద్ధరించుటకు భగవంతుని యనంతలీలావిభవ మిందు వర్ణింపఁబడుటచే ఈ గ్రంథమునకు భాగవతమని పేరువచ్చినది. దీనిని సంస్కృతభాషనుండి శ్రీ బమ్మెర పోతనయను మహాభక్తుఁ డాంధ్రీకరించెను. ఈయన యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యస గోత్రుఁడు. కడపమండలములోని యేకశిలాపురవాసి. ఈ సహజపండితకవి తన యమృతవాహినివంటి కవితా ధారతోను, అచంచలభక్తిభావనాశక్తితోను జనుల హృదయము నొక్కసారిగనే భక్తిరసజలనిధి మునకలాడించి, తేలించి యానందసీమకుఁజేర్చిన సమర్థుఁడు. ఆంధ్రమున దీనికిదియే సాటి. ఈకవియోగి క్రీ.శ. [illegible] వఱకునుండిన వేంకటగిరి ప్రభువగు సర్వజ్ఞసింగభూపాలునికి సమకాలికుఁడు. భోగినీదండకము, వీరభద్రవిజయము మను గ్రంథముల నీయన వ్రాసెనని యొకప్రతీతి కలదు.

ప్రకాశకులు

# శ్రీరామచంద్రాయ నమః

# గజేంద్రమోక్షము

## టీకాతాత్పర్య సహితము

శ్రీమన్నామ పయోద
శ్యామధరాభృల్లలామ ! జగదభిరామా
రామాజనకామ మహో
ద్దామ గుణస్తోమ ధామ ! దశరథరామా. 1

టీ. శ్రీమన్నామ = సకలసంపదలతోఁ గూడిన పేరుగలవాఁడా! పయోదశ్యామ-పయోద = నీరమునిచ్చునట్టి మేఘమువలె, శ్యామ = నల్లని వాఁడా! ధరాభృత్ + లలామ = రాజులలోపలశ్రేష్ఠుఁడా! జగత్ + అభిరామా=లోకములకు అలంకారమైనవాఁడా! రామాజనకామ = స్త్రీలచేఁ గోరదగినవాఁడా! మహోద్దామ=మిక్కిలి గంభీరమైనవాఁడా! గుణస్తోమ ధామ = మంచిగుణముల కునికిపట్టైనవాఁడా! దశరథరామా = దశరథ పుత్త్రుఁడగు రామమూర్తీ!

తా. భక్తులకు సంపద లొసఁగు నామముగలవాఁడవు, వర్షాకాల మేఘంబుచందంబున నల్లనైనవాఁడవు. లోకుల కందఱకుఁ గోరఁదగిన వాఁడవు, స్త్రీ హృదయవల్లభుఁడవు, మిక్కిలి గంభీరతగలవాఁడవు, సుగుణ గణరాశియునైన యో రామమూర్తీ! నేను జెప్పఁబోవు గజేంద్రమోక్షమును విన్నుమని కృతికర్త శ్రీరాములకంకితము చేయుచున్నాఁడు.

సీ. మానవాధీశ్వర ! మనువు నాలవవాఁడు
తామసుం డనఁగ నుత్తమునిభ్రాత
పృథివీపతులు కేతు ! వృషనరఖ్యాతాదు
లతనిపుత్త్రులు పద్గు ! రధికబలులు
సత్యకహరివీరసంజ్ఞులు వేల్పులు
త్రిశిఖనామమువాఁడు ! దేవవిభుఁడు
మునులు జ్యోతిర్వ్యోమ ! ముఖ్యులు హరి పుట్టె
హరిమేధునకుఁ బ్రీతి ! హరిణియందు

ఆ. గ్రహనిబద్ధుఁ డయిన ! గజరాజు విడిపించి
ప్రాణభయమువలనఁ ! బాపి కాచె
హరి దయాసముద్రుఁ ! డఖిలలోకేశ్వరుఁ
డనిన శుకునిఁ జూచి ! యవనివిభుఁడు. 2

టీ. మానవ+అధీశ్వర = నరులకుఁబాలకుఁడవయిన యోపరీక్షి న్మహా రాజా ! మనువునాలవవాఁడు = నాలవమనువు, తామసుఁడు+అనంగన్ = తామసుఁ డను పేరుగలవాఁడు, ఉత్తమునిభ్రాత = ఉత్తముఁడను పేరుగల మూఁడవమనువుయొక్క తమ్ముఁడు, అధికబలులు = ఎక్కువబలిమిగల, వృష నరఖ్యాత+ఆదులు = వృషుఁడు, నరుఁడు, ఖ్యాతుఁడు మొదలగువారయిన, అతనిపుత్త్రులు పద్గురు = అతనికొడుకులు పదిమందియు, పృథివీపతులు = రాజులు, సత్యకహరివీరసంజ్ఞులు = సత్యకుఁడు, హరివీరుఁడు నను పేరుగల వారు, వేల్పులు = దేవతలు, దేవవిభుఁడు = వేల్పులకుఁ దగునింద్రుఁడు, త్రిశిఖనామమువాఁడు = త్రిశిఖుఁడను పేరుగలవాఁడు, మునులు = ఋషులు, జ్యోతిర్వ్యోమముఖ్యులు = జ్యోతిస్సు, వ్యోముఁడు మొదలగువారు, హరి.

మేధునకున్ = హరిమేధుఁ డను పేరుగలవానికి, హరిణియందున్ = హరిణి యనునామెయందు, ప్రీతిన్ = అపేక్షతో, హరి = విష్ణువు, జన్మించెను = అవతరించెను, దయాసముద్రుఁడు = దయ యనునీటికి సముద్రమైన వాఁడును, అఖిలలోక+ఈశ్వరుఁడు=లోకముల నన్నిటిని నేలువాఁడునైన, హరి=విష్ణుఁడు, గ్రహనిబద్ధుఁడు + అయిన=మొసలిచేఁ గాలియందుఁ బట్టఁ బడిన, గజరాజున్ = గజేంద్రుని, విడిపించి = (మొసలినుండి) పట్టుతొలఁగించి, ప్రాణభయమువలనన్ + పాపి = ప్రాణముపోవునని దిగులుపడు చుండిన గజేంద్రుని భయంబును తొలఁగించి, కాఁచెను = రక్షించెను, అని నన్ = అని (శుకమహాముని) చెప్పఁగా, అవనివిభుఁడు = పరీక్షిన్మహారాజు, శుకునిన్ = శుకమహామునిని, చూచి (పై పద్యముతో నన్వయము).

తా. ఓ పుడమిఱేఁడా ! తామసుఁ డనువాఁడు నాలవమనువు. ఆతఁ డుత్తముఁ డను పేరుగలమూఁడవమనువుయొక్క తమ్ముడు, ఆ మనువుకాలమున బలవంతు లగు నాతనికొడుకులగు కేతువు, పృథువు, నరుఁడు మొదలగువారు పదుగురు పుడమిఁ బాలించుచుండిరి. దేవతలు సత్యకుఁడు, హరి వీరుఁడునను పేరుగలవారుగను, ఇంద్రుఁడు త్రిశిఖుఁ డనువాఁడుగను, ఋషులు జ్యోతిస్సు, వ్యోముఁడు నను పేరుగలవారుగను నుండిరి. అతని కాలమున హరిమేధుఁ డనువానికిని హరిణి యనునామెకును విష్ణువు పుత్రుఁ డుగఁబ్రీతితో నవతరించెను. దయాళువును, లోకముల కన్నిటికిఁ బాలకుఁడు నైన యావిష్ణు వొకప్పుడు మొసలిచేఁ జిక్కి ప్రాణములు పోవునని తల్లడిల్లి తన్నుఁదలఁచిన గజేంద్రుని మొసలివలన విడిపించి ప్రాణభయంబు వోఁగొట్టి కాపాడెనని శుకయోగీంద్రుఁడు పరీక్షిన్మహారాజుతోఁ జెప్పఁగా నతఁడు శుకులవారిం జూచి యిట్లనెను.

క. నీరాటవనాటములకుఁ
బోరాటం బెట్లు గలిగెఁ ? బురుషోత్తముచే

నారాట మెట్లు మానెను
ఘోరాటవిలోనిభద్ర శ్రీకుంజరమునకున్.

టీ. నీర + అట + వన + అటములకున్ = నీటియందుఁ దిరుగుదానికిని, (మొసలికిని), అడవులందుఁ దిరుగుదానికిని, (ఏనుఁగునకును), పోరాటంబు = జగడము, ఎట్లు = ఏ విధముగా, కలిగెను ? ఘోర + అటవిలోని = భయంకరమగు నడవియందుఁ దిరుగు, భద్రకుంజరమునకున్ = భద్రజాతియందుఁ బుట్టిన యా ఏనుగునకు, (కలిగిన) ఆరాటము = బాధ, పురుషోత్తముచేన్ = విష్ణువవలన, ఎట్లు = ఏవిధముగా, మానెను = తొలగెను ?

తా. ఓ మునీంద్రా ! మొసలి గజములకు జగడము జరిగెనని చెప్పితిరి. వానిలో నొకటి నీటిలో నివసించునది, మఱొక్కటి యడవిలోఁ దిరుగునది. వీనికి రెంటికిని జగడ మెట్లు సంభవించెను ? ఆ గజేంద్రునికిఁ గలిగిన యాబాధ విష్ణు వేవిధముగా తొలఁగించెను ?

క. మునినాథ ! యీ కథాస్థితి
వినిపింపుము వినఁగ నాకు శ్రీ వేడుకపుట్టెన్
వినియెదఁ గర్ణేంద్రియములు
పెనుఁబండువు సేయ మనముఁ శ్రీ బ్రీతిం బొందన్. 4

టీ. మునినాథ = మునులకుఱేఁడా ! ఈ కథాస్థితిన్ = ఈ కథ యొక్క తీరును, వినఁగన్ = వినుటకు, వేడుక = అపేక్ష, పుట్టెన్ = కలిగెను, వినిపింపుము = నే నాకథ వినునట్లు చేయుము, కర్ణ + ఇంద్రియములు = చెవులు, పెనుఁబండువుసేయన్ = మిక్కిలి యానంద మొందునట్లును, మనము = మనస్సు, ప్రీతిన్ = తనివిని, పొందన్ = పొందు విధంబునను, వినియెదను.

తా. ఓ మునిశ్రేష్ఠా! నా కీ కథ వినవలయునని యాశపుట్టినది. తాము నాయం దనుగ్రహించి వినిపించితిరేని చెవులును, మనస్సును సంతస పడునట్లు శ్రద్ధతో వినెదను.

క. ఏకథలయందుఁ బుణ్యా
శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే
నాకథలు పుణ్యకథ లని
యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్. 5

టీ. ఏ కథలయందున్ = ఏ చరిత్రలయందు, సూరిజనముచేన్ = పండితులచేతను, (బ్రహ్మజ్ఞానులచేతను) పుణ్యశ్లోకుండు=పావనముచేయు కీర్తిగలవాఁడయిన, హరి=విష్ణువు, చెప్పఁబడును = కీర్తింపబడుచున్నాఁడో, ఆ కథలు = ఆ చరిత్రములు, పుణ్యకథలు అని = పాపముఁ బోఁగొట్టు పుణ్యప్రదములయిన చరిత్రలని, పెద్దలు = జ్ఞానవృద్ధులు, అతిహర్షమునన్= మిక్కిలి సంతోషముతో, ఆకర్ణింపుదురు = విందురు.

తా. భగవన్నామ సంకీర్తనగల కథలు పుణ్యప్రదము లను కారణముచే జ్ఞానులగు పెద్దలు మిక్కిలి మక్కువతో విష్ణుకథలను వినుచుందురుగదా!

వ. ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుం డైనపరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగె నని చెప్పి సభాసదులయినమునుల నవలోకించి సూతుఁడు పరమహర్షసమేతుండై చెప్పె నట్లు శుకుండు రాజున కిట్లనియె. 6

టీ. ఇవ్విధంబునన్ = ఈ తీరున, ప్రాయోపవిష్టుండు+అయిన= మరణార్థుఁడయి సర్వ కర్మలఁ బరిత్యజించి దర్భలమీఁదఁ బరుండి.

యుపవాసము చేయుచున్న, పరీక్షిన్నరేంద్రుఁడు = పరీక్షిన్మహారాజు, బాదరాయణిన్ = వ్యాసమహర్షియొక్క పుత్త్రుఁడగు శుకమునీంద్రుని, అడిగెను, అని చెప్పి, సభాసదులన్ = సభలోఁ గూర్చుండియున్న శౌనకాది మహామునులను, అవలోకించి = చూచి, సూతుండు, పరమహర్ష సమేతుండు + ఐ = ఎక్కువ సంతసముతోఁ గూడినవాఁడై, చెప్పెను, అట్లు = ఆ ప్రకారము, పరీక్షిన్మహారాజడుగఁగా, శుకుండు = శుకమహాముని, రాజునకున్ = పరీక్షిత్తునకు, ఇట్లు, అనియెన్ = అనియెను.

తా. సూతమహాముని శౌనకాదిమహామునులను జూచి, "మునులారా! ఇవ్విధంబునఁ బరీక్షిన్మహారాజు మరణమునిమిత్తము సర్వకర్మములఁ బరిత్యజించి, నిరశనవ్రతంబు పూని, శ్రీవిష్ణుకథాసుధారసమును వీనులార వినఁగోరి శుకమహర్షి నిట్లడిగె" నని చెప్పి, యాశుకుఁడు పరీక్షిన్మహారాజునకుఁ జెప్పినతీరున వినిపింపఁదొడంగెను. ఆ శుకుఁడు భగవన్నామకీర్తనంబు వినఁగోరియున్న పరీక్షిన్మహారాజుతో నిట్లనియె.

సీ. రాజేంద్ర! విను సుధా ♦ రాశిలో నొకపర్వ
తము త్రికూటం బనఁ ♦ దనరుచుండు
యోజనాయుత మగు ♦ నున్నతత్వంబును
నంతియ వెడలుపు ♦ నతిశయిల్లుఁ
గాంచనాయస్సార ♦ కలధౌతమయము లై
మూఁడుశృంగంబులు ♦ మొనసియుండుఁ
దటశృంగబహురత్న ♦ ధాతుచిత్రితములై
దిశలు భూనభములు ♦ దేజరిల్లు

తే. భూరిభూజలతాకుంజపుంజములును
ప్రోసి పఱతెంచు సెలయేటిమొత్తములును
మరగి తిరిగెడుదివ్యవిమానములును
జఱులఁ గ్రీడించుకిన్నరచయము గలిగి. 7

టీ. రాజేంద్రా = రాజులకురాజా ! వినుము = (నేఁజెప్పుదానిని) ఆలకింపుము, సుధారాశిలోన్ = పాలకడలియందు, ఒకపర్వతము = ఒక కొండ, త్రికూటంబు + అనన్ తనరుచుండును = త్రికూటమను పేరుతో నొప్పియుండును, (ఆపర్వతము) యోజన + అయుతము + అగు ఉన్నతత్వంబును = పదివేల యోజనంబులయెత్తును, అంతియ = ఆమాత్రమే, వెడలుపును = వైశాల్యమును, అతిశయిల్లును = మీఱి యుండును, కాంచన + అయస్సార కలధౌతమయములు + ఐ = బంగారము, ఇనుము, వెండి వీని వికారములై, మూఁడుశృంగంబులు = మూఁడుకొనలు, మొనసియుండున్ = కలిగియుండును, తట...లై = తట = చరులయొక్క, శృంగ = శిఖరములయందలి, బహు = అనేకవిధములయిన, రత్న = కెంపులచేతను, ధాతు = గైరికాదిధాతువులచేతను, చిత్రితములై = పలు రంగులుగలవై, దిశలు = దిక్కులు, భూనభములు = భూమియు నాకాశ మును, తేజరిల్లున్ = వెలయుచుండును, భూరి...లును-భూరి = లెక్కలేని భూజ = చెట్లయొక్క, లతా = తీఁగెలయొక్క, కుంజ = పొదలయొక్క, పుంజములును = గుంపులును, మ్రోసి = ధ్వనించి, పఱతెంచుసెలయేటి మొత్తములును = పాఱుచుండు సెలయేళ్ళయొక్క సమూహములును, మరగి = అలవాటుపడి, తిరిగెడు దివ్యవిమానములును = సంచరించుచుండు దేవతలవిమానంబులును, చఱులన్ = కందరములయందు, క్రీడించుకిన్నర చయముకలిగి = విహారము చేయుచుండు కిన్నరుల సమూహముఁ గలిగి, (పైపద్యముతో నన్వయము.)

తా. ఓపరీక్షిన్మహారాజా ! నామాటల వినుము. పాలకడలియందుఁ ద్రికూటం బనుపర్వత మొక్కటిగలదు. దానియెత్తును, పెడల్పును బదివేల యోజనములు. ఆ పర్వతమునకు మూడుశిఖరములు గలవు. వానిలో నొక్కటి బంగారుమయంబును, మఱొక్కటి వెండిమయమును, వేఱొకటి యయోమయము (ఇనుపదియు) నైయున్నవి. ఆపర్వతంబునందలిచఱులలో ననేకమణులును, గావిరాళ్ళను బలురంగులతోఁగూడి దిక్కులను, భూమిని, యాకాశమును వెలిగించుచుండును. ఆ పర్వతమున లెక్కలేనిచెట్లును, తీఁగె, లును, పొదలు నున్నవి. సెలయేళ్లు గొప్పధ్వనులతోడఁ బాఱుచున్నవి. దేవత లాపర్వతంబునందలివేడుకలను జూచుటకై విమానంబులందెల్లప్పుడు సంచరించుచుందురు. కొండచఱులలోఁ గిన్నరదంపతులు విహారములు సల్పుచుందురు.

వ. అది మఱియును మాతులుంగ లవంగలుంగ చూత కేతకీ భల్లాత కామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుళ వట కుటజ కుంద కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సిందువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశు పాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్త్ర మరువక మల్లికా మతల్లికా ప్రముఖ నిరంతర వసంతసమయ సౌభాగ్య సంప దంకురిత పల్లవిత కుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరు న్నివహాలంకృతంబును, మణివాలు కానేక విమల పులిన తరంగిణీ సంగత విచిత్ర విద్రుమలతా

మహోద్యాన శుక పిక నికర నిశిత సమంచిత చంచూపుటనిర్దళిత శాఖిశాఖాంతర పరిపక్వఫలరంధ్రప్రవర్షితరసప్రవాహబహుళంబును, గమనీయకాసారకాంచన కుముద కహ్లార కమల పరిమళ మిళిత కబళాహార సంతతాంగీకారభారపరిశ్రాంత కాంతాసమాలింగితకుమార మత్తమధుకరవిటసముదయసమీప సంచారసముదంచిత శకుంతకలహంస కారండవ జలకుక్కుట చక్రవాక బక బలాక కోయష్టిక ముఖర జలవిహంగవిసర వివిధ కోలాహలబధిరీభూత ఘనభోంతరాళంబును, దుహిన కరకాంత మరకత కమలరాగ వజ్రవైడూర్య నీల గోమేధిక పుష్యరాగ మనోహర కనక కలధౌతమణి మయానేక శిఖర తట దరీ విహారమాణ విద్యాధర విబుధ సిద్ధచారణ గరుడ గంధర్వ కిన్నర కింపురుష మిథున సంతత సరససల్లాపసంగీతప్రసంగ మంగళాయతనంబును, గంధగజగవయగండభేరుండ ఖడ్గకంఠీరవ శరభశార్దూల చమరశల్య భల్లసారంగసాలావృకవరాహ మహిష మర్కటమహోరగ మార్జాలాదినిఖిలమృగనాథ సమూహ సమర సన్నాహసంరంభసంచకితశరణాగత శమనకింకరంబునునై యొప్పునప్పర్వతసమీపంబునందు,

టీ. అది=ఆ పర్వతము, మఱియును = ఇంకను, మాతులుంగ .... లంకృతంబును, మాతులుంగ = మాదీఫలపుజెట్లు, లవంగ = లవంగపు

జెట్లు, లుంగ = పుల్లమాదీఫలపుఁజెట్లు, చూత = మామిడి, కేతకీ = మొగలి, భల్లాతక = జీడి, ఆమ్రాతక = అంబాళము, సరళ = తెల్లతెగడ, పనస, బదరీ = రేఁగు, వకుళ = పొగడ, వంజుళ = ప్రబ్బ, వట = మఱ్ఱి, కుటజ = కొండమల్లె, కుంద = మల్లె, కురవక = ఎఱ్ఱగోరింట, కురంటక = పసుపుగోరింట, కోవిదార = కాంచనము, ఖర్జూర=ఖర్జూరపుఁ జెట్లు, నారికేళ = కొబ్బరి, సిందువార = వావిలి, చందన = గంధపుఁజెట్లు, పిచుమంద = వేఁపచెట్లు, మందార = మందారపుఁజెట్లు, జంబూ = నేరేడు, జంబీర = నిమ్మ, మాధవీ = గు రి వెం ద, మధూక = ఇప్ప, తాల = తాటి, తక్కోల = తక్కోలపుఁజెట్లు, తమాల = ఉలిమిరి, హింతాల = గిరకతాడి, రసాల = తియ్యమామిడి, సాల = ఏపి, ప్రియాళు = మోరటి, బిల్వ = మారేఁడు, ఆమలక = ఉసిరిక, క్రముక = పోఁక, కదంబ= కడప, కరవీర = గన్నేరు, కదళీ = అరఁటి, కపిత్థ = వెలఁగ, కాంచన = కాంచనపుఁజెట్లు, కందరాళ = కలజువ్వి, శిరీష = దిరిసెన, శింశుపా = ఇరుగుడు, అశోక = అశోకము, నాగ = నాగకేసరము, పున్నాగ = సురపొన్న, చంపక = సంపెంగ, శతపత్త్ర = తామర, మరువక = మరువము, మల్లికామతల్లికా = మేలైనమల్లెలు, ప్రముఖ = మొదలగు నవియు, నిరంతర = ఎడతెగని, వసంతసమయ = వసంతర్తువునందలి, సౌభాగ్యసంపత్ = సౌందర్యాతిశయముగలవియు, అంకురిత = మొలకలు గలవియు, పల్లవిత = చిగుళ్లుగలవియు, కుసుమిత = పూలుకలవియు, ఫలిత = పండ్లుగలవియునైనందున, లలిత = సొగసైయుండు, విటప = కొమ్మలుగల, విటపి = చెట్లయొక్కయు, వీరుత్ = పొదలయొక్కయు, నివహ = గుంపుచేత, అలంకృతంబును = వెలిఁగింపఁబడినదియు, మణివాలు...బహుళంబును - మణివాలుకా = రత్నపుటిసుకతోఁగూడిన, అనేక= పలువిధములైన, విమల = తేటయైన, పులిన = ఇసుకతిన్నెలుగల, తరంగిణీ = నదులందు, సంగత = కలిసియున్న, విచిత్ర = వింతగొలుపు, విద్రుమలతా = పగడపుఁ దీఁగలయొక్క, మహత్ = గొప్ప, ఉద్యాన =

తోఁటలందలి, శుక = చిలుకల, పిక = కోయిలల, నికర = గుంపుయొక్క, నిశిత = వాడియైన, సమంచిత = బాగుగాఁగూడిన, చంచూపుట = ముక్కు తొట్టిలచేత, నిర్దళిత = చీల్పఁబడిన, శాఖ = చెట్లయొక్క, శాఖ+అంతర = కొమ్మలనడుమ, పరిపక్వ = బాగుగా విఱియఁబడిన, ఫల = పండ్లయొక్క, రంధ్ర = చిన్నసందులనుండి, ప్రవర్షిత = కూర్చఁబడిన, రసప్రవాహ = మకరందప్రవాహముచేత, బహుళంబును = నిండినదియు, కమనీయ... రాళంబును - కమనీయ = అందమైన, సలిల = నీరుగల, కాసార = కొలఁకులందలి, కాంచన = బంగారపు, కుముద = తెల్లకలువలు, కహ్లార = చెంగల్వలు, కమల = తామరపువ్వులు ననువీనియొక్క, పరిమళ = తావితో, మిశిత = కూడిన, కబళ+ఆహార = కబళములనెడు నాహారముయొక్క, సంతత = ఎడతెగని, అంగీకార = పుచ్చుకొనుటయను, భార = బరువు చేత, పరిశ్రాంత = బడలిన, కాంతా = భార్యలచేతను, సమాలింగిత = కౌఁగిలింపఁబడిన, కుమార = వయసులోనున్న, మత్త = మదించిన, మధుకర = తుమ్మెదలను, విట = జారులయొక్క, సముదయ = గుంపు యొక్క, సమీప = చేరువను, సంచార = తిరుగుటచేత, సముదంచిత = మిక్కిలి సొంపయిన, శకుంత = పక్షులు, కలహంస = రాజహంసములు, కారండవ = కన్నెలేళ్లు, జలకుక్కుట = నీటికోళ్లు, చక్రవాక = చక్రవాక పక్షులు, బక = కొంగలు, బలాక = పెద్దకొంగలు, కోయష్టిక = చీకుఁ గొక్కెరలు, ప్రముఖ = మొదలగు, ముఖర = ధ్వనించుచున్న, జల విహంగ = నీటిపక్షులయొక్క, విసర = గుంపుయొక్క, వివిధ = పలు తెఱఁగులైన, కోలాహల = ధ్వనులచేత, బధిరీభూత = చెవుడుపట్టినట్టైన, భూ = పుడమియొక్క, నభః = ఆకాశముయొక్క, అంతరాళంబును = మధ్యభాగముగలదియు, తుహి...నంబును-తుహినకరకాంత = చంద్రకాంత మణులు, మరకత = పచ్చలు, కమలరాగ = కెంపులు, వజ్ర = వజ్రములు, వైడూర్య = వైడూర్యములు, నీల = ఇంద్రనీలములు, గోమేధిక = గోమేధికములు, పుష్యరాగ = పుష్యరాగమణులు, మనోహర = అందమైన,

కనకకలధౌతమణిమయ = బంగారు రత్నములనుచేరిన, అనేక = లెక్కలేని, శిఖర = కొనలందలి, తటదరీ = పేటులందు, విహరమాణ = ఆటాడు చుండు, విద్యా...తనంబును = విద్యాధరులు, విబుధులు, సిద్ధులు, చారణులు, పక్షులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు ననుదేవయోనుల దంపతుల యెడతెగని సరసంపుమాటలయు, సంగీతములయు ప్రచారంబుచే శుభకరంబులయిన యునికిపట్టుకలదియు, గంధగజ...కింకరంబును, గంధగజ = మదపుటేనుఁగులు, గవయ = కాఱెనుబోఁతులు, గండభేరుండ= గండభేరుండములు, ఖడ్గ = ఖడ్గమృగములు, కంఠీరవ = సింగములు, శరభ = ఎనిమిదికాళ్ళమృగములు, శార్దూల = పులులు, చమర = సవరపు మృగములు, శల్య = ముండ్లపందులు, భల్ల = ఎలుఁగుబంట్లు, సారంగ = జింకలు, సాలావృక = తోఁడేళ్లు, వరాహ = అడవిపందులు, మహిష = దున్నలు, మర్కట = కోఁతులు, మహోరగ = గొప్పపాములు, మార్జాల= గండుఁబిల్లులు, ఆది = మొదలగు, నిఖిల = అన్ని, మృగనాథ = మేటి మెకముల, సమరసన్నాహ = యుద్ధప్రయత్నమందలి, సంరంభ = ఆడంబ రముచేత, సంచకిత = మిక్కిలిభయపడినవారలై, శరణాగత = శరణు చొచ్చిన, శమనకింకరంబును=యమభటులు గలదియు, ఐ, ఒప్పు ఆ పర్వత సమీపంబునన్ = వెలయు నా పర్వతముదగ్గఱ, (పైపద్యముతో నన్వయము)

తా. మఱియు నా పర్వతంబున ననేకములైన వృక్షము లీ ఋతు వా ఋతు వను భేదంబులేక, ఎల్లప్పుడు వసంతఋతువునందువలెనె మొలకలు, చిగురు, పువ్వులు, కాయలు, పండ్లుకలిగి శోభిల్లుచుండును. రత్నమయమైన యిసుకగల యిసుకతిన్నెలుగల నదులతీరమందలి వింతలయిన పగడపుఁ దీఁగలుగల యుద్యానవనములందు విహరించుచున్న చిలుకలు మొదలగు పక్షులు తమ గట్టిముక్కులతోఁ బొడుచుటచేఁ జెట్టుకొమ్మల సందులం దుండు ప్రాగిన పండ్లనుండికాఱు రసప్రవాహము లచ్చట నిండియుండును. అచ్చట ననేకములైన తామరకొలకులందుండు తామరతూండ్లు మొదలగు

నాహారంబులను భుజించి, తమప్రియులతోఁగూడి విహరించెడి హంసములు మున్నగు జలపక్షులు శ్రావ్యముగాఁగూయుకూఁతలతో భూమ్యంతరిక్షంబులు నిండియుండు. ఆ పర్వతంబు నవరత్నఖచితమైన దరులందు విహరించు చుండు సిద్ధాదిదేవయోనుల సంగీతధ్వనులతోఁ గూడియుండు. అచ్చట నుండు సింహశార్దూలాది మృగంబులు పోరునందు యమకింకరులనైన నోడింపఁగలవు. అట్టి పర్వతమున,

క. భిల్లీ భిల్ల లులాయక
భల్లుక ఫణి ఖడ్గ గవయ బలిముఖ చమరీ
ఝిల్లి హరి శరభ కరి కిటి
మల్లాద్భుత కాక ఘూకమయ మగు నడవిన్. 9

టీ. భిల్లీ....మయము-భిల్లీ = బోయతలు, భిల్ల = బోయలు, లులాయక = ఎనుబోతు, భల్లుక = ఎలుఁగుబంట్లు, ఫణి = పాములు, ఖడ్గ = ఖడ్గమృగములు, గవయ = గురుపోతులు, బలిముఖ = కోఁతులు, చమరీ= సవరపుమృగములు, ఝిల్లి = ఈలపురుగులు, హరి = సింహములు, శరభ= శరభమృగములు, కరి = ఏనుఁగు, కిటిమల్ల = శ్రేష్ఠములైన పందులు, అద్భుత = వింతగొలుపు, కాక = కాకులు, ఘూకమయము = గుడ్లగూబల చేతను నిండినది, అగు + అడవిన్=అయిన అడవియందు, (పైపద్యముతో నన్వయము.)

తా. ఆ పర్వత సమీపంబున బోయలు, బోయతలు, సింహ శార్దూలాదులగు పైఁజెప్పిన మృగంబులతో నిండిన యొక యడవియందు,

శా. అన్యాలోకనభీకరంబులు జితాశానేకపానీకముల్
వన్యేభంబులు గొన్ని మత్తతను లై స్వవ్రజ్యావిహారాగతో
దన్యత్వంబున భూరిభూధరదరీద్వారంబులందుండి సౌ
జన్యక్రీడల నీరుగాలి వడి కాసారావగాహార్థమై. 10

టీ. అన్య....రంబులు - అన్య = ఇతరులయొక్క, ఆలోకన = చూపులకు, భీకరంబులు = వెఱపుగలిగించునవియు, జిత....కముల్-జిత= జయింపఁబడిన, ఆశా = దిక్కులందలి, అనేకప = ఏనుఁగులయొక్క, అనీకముల్ = గుంపులు గలవియునైన, వన్య+ఇభంబులుకొన్ని = వనంబు లందుఁ బుట్టిన కొన్నియేనుఁగులు, మత్తతనులు+ఐ=మదించిన దేహముఁ గలవై, వ్రజ్యా....ఉదన్యత్వంబునన్, వ్రజ్యా=తమజాతితోఁగూడ, విహార= తిరుగుటచేత, ఆగత=కలిగిన, ఉదన్యత్వంబునన్=దప్పిగలవియగుటచేతను, భూరి....ద్వారంబులందున్ + ఉండి, భూరి = విస్తారములైన, భూధర = పర్వతములయొక్క, దరీ=గుహలయొక్క, ద్వారంబులందున్+ఉండి = వాఁకిళ్ళనుండి, సౌజన్యక్రీడలన్ = తిన్నఁదనముతోఁగూడినయాటలచే. పిరుగాలి=నీఁటిమీఁది చల్లనిగాలి, పడి=సోఁకి,కాసార+అవగాహ+అర్థమై= కొలఁకులలో మునుఁగుటకై, (పైపద్యముతో నన్వయము.)

తా. ఆయరణ్యంబుననితరులకు వెఱపుఁగలిగించునవియు, దిగ్గజముల సమూహమునుసైతము గెల్చునవియునైన కొన్ని యడవి యేనుఁగులు తమగుంపులతో నచ్చటిగుహలలోఁ దిరిగితిరిగి, దప్పిగొని, నీటిపైగాలి సోఁకఁగా, నచ్చటికొలఁకులలో మునుఁగఁ గోరినవై,

ఆ. అంధకార మెల్ల ౯ నద్రిగుహాంతర
వీథులందుఁ బగలు ౯ వెఱచి డాఁగి
యెదరు వేచి సంధ్య ౯ నినుఁడు వృద్ధత నున్న
వెడలె ననఁగ గుహలు ౯ వెడలెఁ గరులు. 11

టీ. అంధకారము+ఎల్లన్=చీఁకటియంతయు, పగలు=పగటిపూఁట, వెఱచి=భయపడి, అద్రిగుహ+అంతరవీథులందున్=పర్వతములయొక్క గుహలయొక్క మధ్యప్రదేశములందు, డాఁగి = దాఁగియుండి, ఎదరు = సమయము, వేచి = కాఁచియుండి, సంధ్యన్ = సాయంసంధ్యాకాలంబున,

ఇనుఁడు=సూర్యుఁడు, వృద్ధతన్ = ముసలితనమున, ఉన్నన్ = ఉండఁగా, వెడలెన్+అనఁగన్=బయలువెడలినదో యనునట్లు, కరులు = ఏనుఁగులు, గుహలు=సొరంగములనుండి, వెడలెను=బయలుదేఱెను.

తా. ఆయేనుఁగులు గుహలనుండి వెడలుట చూడఁగాఁ జీఁకటి పగటిపూఁట సూర్యునికివెఱచి, గుహలలో దాఁగియుండి, యతఁడు క్రుంకఁగానే గుహలనుండి వెడలివచ్చినదో యనునట్లు తోఁచెను. 'లోకములందు రాజులు తమశత్రువులు బలవంతులుగా నున్నప్పుడు తా ముందుతావు తెలియకుండునట్లుండి, సమయము కనిపెట్టి, తమశత్రువులు హీనదశలో నున్నప్పుడు చెలరేఁగుదురు' అని ఈపద్యమున నొక ధ్వన్యర్థము తోఁచుచున్నది. ఏనుఁగులు చీఁకటివలె నల్లనై గొప్పవిగ నున్నందున నట్లుత్ప్రేక్షఁ జేయఁబడినవి.

క. తలఁగవు కొండలకైనను
మలఁగవు సింగములకైన ౯ మార్కొనుఁ గడిమిం
గలఁగవు పిడుగులకైనను
నిల బలసంపన్నవృత్తి ౯ నేనుఁగుగున్నల్. 12

టీ. ఏనుఁగుగున్నల్ = ప్రాయంపు టేనుఁగులు, ఇలన్ = భూమియందు, బలసంపన్నవృత్తిన్=బలముతోఁగూడిన యునికిచేత, బలముఁగల్గియుండుటచేత, కొండలకైనను=పర్వతములకైనను, తలఁగవు = తొలఁగిపోవు, సింగములకైనను = సింహము లెదురుగావచ్చినను, మలఁగవు = మిఱఁదరింపవు, కడిమిన్ = బలముతో, మార్కొనున్ = ఎదిరించును, పిడుగులకైనన్=వజ్రాయుధములకైనను, కలఁగవు=కలవరమునొందవు.

తా. అట్లు పర్వతగుహలనుండి వెలువడిన యాప్రాయపుటేనుఁగులు మిక్కిలి బలిమిగలవిగా నుండుటచేతఁ బర్వతము లెదురుగావచ్చినను,

వానినిఁ ద్రోచికొని పోవును. సింహములు తమపైకి వచ్చెనేని, వానికి వెఱవక బలిమితోఁ బోరాడును. పిడుగులు పడినను గలఁత చెందవు.

సీ. పులుల మొత్తంబులు ॥ పొదరిండ్లలోఁ దూఱు
        ఘోరభల్లూకముల్ ॥ గుహలు సొచ్చు
    భూదారములు నేల ॥ బొరియలలో డాఁగు
        హరిదంతముల కేఁగు ॥ హరిణచయము
    మడువులఁ జొఱఁబాఱు ॥ మహిషసంఘంబులు
        గండశైలంబులఁ ॥ గపులు ప్రాఁకు
    వల్మీకములు సొచ్చు ॥ వనభుజంగంబులు
        నీలకంఠంబులు ॥ నింగి కెగయు

తే. వెఱచి చమరీమృగంబులు ॥ విసరువాల
    చామరంబుల విహరణ ॥ శ్రమము వాయ
    భయదపరిహేల విహరించు ॥ భద్రకరుల
    గాలి పాఱినమాత్రాన ॥ జాలిఁ బొంది. 13

టీ. భయదపరిహేలన్ - భయద = వెఱపించునట్టి, పరిహేలన్ = వేడుకయాటలతో, విహరించుభద్రకరులగాలి = సంచరించునట్టి భద్రజాతియందలి యేనుఁగులమీఁదిగాలి, పాఱినమాత్రానన్ = సోఁకినతోడనే, జాలిన్=దిగులును, పొంది, పులులమొత్తంబులు = పులులగుంపులు, పొదరిండ్లలోన్ + తూఱును=పొదలలోపలికిఁ జొచ్చును, ఘోరభల్లూకముల్ = చూపఱకు దిగులుపుట్టించునట్టి యెలుఁగుబంట్లు, గుహలుచొచ్చున్ = గుహలలోఁ బ్రవేశించును, భూదారములు = పందులు, నేలన్ = నేలయందలి, బొరియలలోన్=కలుగులలో, డాఁగును = దాఁగును, హరి

చయము = జింకలగుంపు, హరిత్ + అంతములకున్ = దిక్కుల యొక్క కొనలకు, ఏఁగున్ = పరుగెత్తును, మహిషసంఘంబులు = ఎనుఁబోతులగుంపులు, మడువులన్ = మడుగులయందు, చొఅన్ + పాఱున్ = ప్రవేశించును, గండశైలంబులన్ = గొప్పపర్వతంబులలోనికి, కపులు = కోఁతులు, ప్రాఁకున్ = జరిగిపోవును, వనభుజంగములు = కొండచిలువలు, వల్మీకములుచొచ్చున్ = పుట్టలలో జొఱబడును, నీల కంఠంబులు = నెమిళ్ళు, నింగికిన్ = ఆకసంబువైపునకు, (పైకి), ఎగయున్ = ఎగురును, చమరీమృగంబులు = సవరపుమెకములు, వెఱచి = దిగులుపడి, విహరణవిభ్రమము = తిరుగుటవలని యలసట, పాయన్ = తొలఁగునట్లు, వాలచామరంబులన్=తోఁక లను వింజామరలతో, విసరున్ = వీఁచును.

తా. అవ్విధంబున సకలమృగంబులను వెఱపించునట్టి యా భద్ర గజములు సంచరించునప్పుడు వానినిఁ జూచినతోడనే పులులు పొదలలోఁ దూఱును. భయంకరములైన యెలుఁగుబంట్లు గుహలలోదాఁగును. పందులు కలుఁగులలోపలఁ బ్రవేశించును. జింకలు మిక్కిలి వెఱచి, దిక్కుల కొనలకుఁ బరుగెత్తును. చమరీమృగంబులు వెఱచి యెటుపోవనుఁ దోఁచక, యాయేనుఁగుల సంచారశ్రమంబు పాయునట్లు తమతోఁక లనెడువింజా మరలతో విసరుచుండును. ఈ పద్యమున నేనుఁగుల గాంభీర్యంబు చూపఁ బడినది.

క. మదగజధానామోదము
కదలనితమకములఁ ద్రావి కడుపులు నిండన్
బొదలుచుఁ దుమ్మెదకొదమల
కదుపులు జుంజు మ్మటంచు గానము సేసెన్. 14

టీ. తుమ్మెదకొదమలకదుపులు = చిఱుతప్రాయముఁగల తుమ్మెదల గుంపులు, మద....దము, మదగజ = మదపుటేనుఁగులయొక్క, దాన = మదజలముయొక్క, ఆమోదము = తావిని, తదలనితమకములన్ = చలింపని యపేక్షలతో, కడుపులు నిండన్ = కడుపులు నిండునట్లుగ, త్రావి = పానముచేసి, (వా స న ( జూ చి), పొచలుచున్ = రేఁగుచు, జుం జు మ్మ + అటంచున్ = ఝంఝుమ్మనుచును, గానముచేసెన్ = పాటపాడెను.

తా. ఆ వనంబునందలి పిన్నవయసుఁగల తుమ్మెదలు మదించిన యా యేనుఁగుల గండములనుండి కాఱెడు మదోదకముయొక్క వాసనను దనివితీఱఁ బీల్చి, మఱింత రేఁగి, ఝుంకారములు చేసెను.

క. తేఁటి యొకటి యొరుప్రియకును
మాటికి మాటికిని నాగమదజలగంధం
బేటికి నని తనుఁ బొందెడి
బోటికి నందిచ్చు నిండు బోటుఁదనమునన్. 15

టీ. తేఁటి ఒకటి = ఒక మగతుమ్మెద, ఒరుప్రియకున్ = మఱొక్క మగతుమ్మెదయొక్క ప్రియురాలికి, నాగమదజలగంధంబు = ఏనుఁగు యొక్క చెక్కిళ్ళయందలి మదోదకముయొక్క వాసన, ఏటికిన్ = ఏల, అని, తనున్ + పొందెడిబోటికిన్ = తనకుఁ బ్రియురాలైన యాఁడు తుమ్మెదకు, నిండుబోటుఁదనమునన్ = మిక్కిలి నేర్పుతో, మాటికి మాటికిని = పలుమాఱు, అందిచ్చున్ = తెచ్చియిచ్చును.

తా. ఇట్లు తుమ్మెదలన్నియు నా యేనుఁగుల మదజలంబుతావినిఁ బీల్చుచుండఁగా, వానిలో నొకమగతుమ్మెద మఱొక్క యాఁడుతుమ్మెద యాగంధంబు నాఘ్రాణించుట చూచి యోర్వలేక యొరులప్రియకాంతల కేల యీ మదజలగంధము? ఇది వీని కక్కఱలేదని తలఁచి, తనప్రియు

వాలగు నాఁడుతుమ్మెదకే మాటిమాటికి నామదజలగంధంబును దెచ్చి యిచ్చును. లోకంబునఁ దమవారినిఁ దాము హెచ్చుగాఁ దలఁచి, వారినిఁ బ్రేమతోఁ బోషించుట సర్వసాధారణము గావుననే యీమగతుమ్మెదయు నటుచేసెనని యెఱుఁగవలయును.

క. అంగీకృతరంగన్మా
తంగీమదగంధ మగుచుఁ దద్దయు వేడ్కన్
సంగీతవిశేషంబుల
భృంగీగణ మొప్పె భ్రమనుపెట్టెడిమాడ్కిన్. 16

టీ. భృంగీగణము = ఆఁడుతేఁటులగుంపు, అంగీ...మదగంధము- అంగీకృత = ఒప్పుకొనఁబడిన, (ఆఘ్రాణింపఁబడిన), రంగత్ = తిరుగుచున్న, మాతంగీ = ఆఁడేనుఁగులయొక్క, మద = మదజలముయొక్క, గంధము = తావిగలది, అగుచున్, తద్దయున్ = మిక్కిలి, వేడ్కన్ = ఉత్సాహముతో, సంగీత విశేషంబులన్ = గానభేదములచేతను, భ్రమను పెట్టెడిమాడ్కిన్ = అట్టె నిలిచినవారినిఁగాఁ జేయునట్లు, ఒప్పెన్ = ప్రకాశించెను.

తా. ఆఁడుతుమ్మెదలు తమప్రియులు దెచ్చియిచ్చెడు మదపుటేనుఁగులమదోదకముయొక్కతావి నాఘ్రాణించి, మిక్కిలి యానందపరవశములై వినువా రాశ్చర్యపడి యట్టె నిలిచిపోవునట్లుగా నానావిధంబులుగా గానము చేసినవి.

క. వల్లభలు పాటి మునుపడ
వల్లభమని మునరిరేని వారణదానం
బొల్లక మధుకరవల్లభు
లుల్లంబులఁ బొంది రెల్ల యుల్లాసంబుల్. 17

టీ. వల్లభలు = తమకాంతలు, పాటి = పరువడి, మునుపడన్ = ముందుగా, వల్లభము + అని = ఇష్టమని, వారణదానంబు = ఏనుఁగుల మదజలమును, (ఏనుఁగుల మదజలము మీఁద), మునరిరేనిన్ = వాలినట్లైన, మధుకరవల్లభులు = మగతుమ్మెదలు, ఒల్లక = (ఆమదజలగంధము నాఘ్రాణింప) నపేక్షింపక, ఉల్లంబులన్ = మనస్సులందు, ఎల్లయుల్లాసంబుల్ = అన్ని సంతసములను, పొందిరి.

తా. తమప్రియురాండ్రు ఆశపడి ముందుగావచ్చి యావారణముల మదజలగంధము నాఘ్రాణింప వానిపై మునరియుండిరేని, వాని యానంద మునకు భంగము గావింప నొల్లక, అవి యాఘ్రాణించినఁ దా మాఘ్రాణించినట్లె యని యెంచి, మగతుమ్మెదలు వాసన నాఘ్రాణింపకయె తమ మనస్సులం దెక్కువసంతోషము నొందినవి.

వ. అప్పుడు, 18

టీ. అప్పుడు = ఆసమయంబున, (అనఁగా : గజములు సకల మృగంబులకు భీతినిఁగలిగించుచుఁ దమమదజలగంధముచేఁ దుమ్మెదలఁ దనివినొందించుచుఁ దిరుగునపుడు),

మ. కలభంబుల్ సెలలాడుఁ బల్వలము లాఘ్రాణించిమట్టా
డుచున్, ఫలభూజంబులు రాయుచుం జివురుజొంపం
బుల్ వడిన్ మేయుచుం, బులులం గాఱెనుపోతులన్
మృగములన్ బోనీక శిక్షించుచున్, గొలఁకుల్ సొచ్చి
కలంచుచున్ గిరులపై గొబ్బిళ్ళు గోరాడుచున్. 19

టీ. కలభంబుల్ = ఏనుఁగుగున్నలు, పల్వలములు = కొంచెము పిరుగల పల్లములను, ఆఘ్రాణించి = వాసనచూచి, మట్టాడుచున్ = కలఁత పెట్టుచు, ఫలభూజంబులు = ఫలవృక్షంబులను, రాయుచు = ఒఱసికొనుచు,

చివురుజొంపంబుల్ = ఇగుళ్ళయొక్క గుబురులను, వడిన్ = వేగముగా, మేయుచున్ = తినుచు, పులులను, కాఱెనుపోతులన్ = అడవిమన్నులను, మృగములన్ = జింకలను, పోనీక = ఇటునటు తప్పించుకొని పాఱిపోనీక, శిక్షించుచున్ = నొప్పించుచును, కొలఁకుల్ చొచ్చి = గుంటలలోఁదిగి, కలంచుచున్ = కలియఁబెట్టుచు, గిరులపైన్ = కొండలమీఁద, గొబ్బిళ్లు గోరాడుచున్ = బాలికయాటలందువలె దంతములతోఁ బొడిచి దుమ్ము నెగురఁగొట్టుచు, చెలలాడున్ = విహరించును.

తా. ఏనుఁగుగున్నలు పడియలను వాసనచూచుచు, ఫలవృక్షంబుల నొఱసికొనుచు, చిగుళ్ళగుబురులను వడిగాఁ గబళించుచుఁ,బులులను, అడవిదున్నలను, జింకలను దమకంటఁ బడినవానిఁ గదలనీయక దాధింపుచు, గుంటలలో దిగి వానినిఁ గలియఁబెట్టుచు, గొబ్బిళ్ళను బాలక్రీడలనుబోలె దంతములతోఁ బెల్లగించి దుమ్ము నెగయఁజల్లుచుఁ దిరుగుచుండినవి.

క. తొండంబుల మదజలవృత
గండంబులఁ గుంభములను ఘట్టనసేయం
గొండలు తలక్రిందై పడు
బెండువడున్ దిశలు సూచి బెగడున్ జగముల్. 20

టీ. తొండములన్=తొండములచేతను, మదజలవృతగండంబులన్= మదజల=మదోదకముతో, వృత=కూడిన, గండంబులన్=చెక్కిళ్ళచేతను, కుంభములన్=గండస్థలంబులచేతను, కొండలు, తలక్రిందైపడును=తలక్రిందగును, దిశలు=దిక్కులు, బెండువడున్=బలహీనములగును, జగముల్= లోకములు, చూచి, బెగడున్=భయపడును.

తా. ఇట్లు ఆయేనుఁగుగున్నలు తమతొండములతోఁ గొట్టఁగాఁ, చెక్కిళ్ళతో నొఱయఁగాఁ, గుంభస్థలములతోఁ బొడువఁగాఁ బర్వతములు

తలక్రిందాయెను. దిక్కులు బలహీనము లాయెను. ముల్లోకంబులందలి జనులు చూచి భయపడుచుందురు.

క. ఎక్కడ జూచిన లెక్కకు
నెక్కువయై యడవి నడచు ౯ నిభయూథములో
నొక్కకరినాథుఁ డెడతెగి
చిక్కెనొకకరేణుకోటి ౯ సేవింపంగన్. 21

టీ. ఎక్కడన్=ఏవైపున చూచినను, లెక్కకున్ ఎక్కువ+ఐ = మితిమీఱి, అడవిన్ = అడవియందు, నడచు = సంచరించెడి, ఇభయూథములోన్ = ఏనుఁగుగుంపులోపల, ఒక్కకరినాథుఁడు=ఒక్కగజేంద్రుఁడు, ఒకకరేణుకోటి = ఒక యాఁడేనుఁగులగుంపు, సేవింపంగన్ = కొల్చుచుండఁగా, ఎడతెగి=దూరమై, చిక్కెను=వెనుకఁ దగులుకొనెను.

తా. ఇట్లు లెక్కలేకుండ సంచరించుచుండెడి యాయేనుఁగులగుంపులం దొక మగయేనుఁగు గొన్నియాఁడేనుఁగులతోఁగూడఁ దనయేనుఁగుల కూటములనుండి వెనుకఁజిక్కి చీలినదాయెను.

వ. ఇట్లు వెనుక ముందఱ నుభయపార్శ్వంబుల నరుగుదెంచు నేనుఁగుగములన్ గానక తెఱంగు దప్పి తొలంగువడి యీశ్వరాయత్తం బయినచిత్తంబు సంవిత్తంబు గాకుండుటంజేసి తానును దనకరేణుసముదయంబును నొక్కతెరువై పోవుచు, 22

టీ. ఇట్లు=ఈప్రకారమున, వెనుకను, ముందఱన్=ముందుభాగమునను, ఉభయపార్శ్వంబులను=రెండుప్రక్కలను, అరుగుదెంచు + ఏనుఁగుగములన్=వచ్చుచున్న యేనుఁగులయొక్క గుంపులను, గానక = చూడక,

తెలుఁగుతప్పి=దారితప్పి,, తొలంగువడి=దూరమై, ఈశ్వర+ఆయత్తంబు=భగవంతునికిలోఁబడినది, అయినచిత్తంబు=అయినతనమనస్సు, సంవిత్తంబు గాకుండుటంజేసి = ఎక్కువ తెలివిగలది కాకున్నందున, తాను = ఆ గజేంద్రుఁడును, తనకరేణుసముదయంబును=తనతోడనున్నయాఁడేనుఁగుల గుంపును, ఒక్కతెరువై పోవుచున్ = ఒకదారినిపోవుచు,

తా. ఇట్లాగజేంద్రుఁడు తనముందును వెనుకను నిరుప్రక్కలను వచ్చుచుండిన యేనుఁగులమందను గానక, దారితప్పి, దూరముననే నిల్చిపోయి, దైవవశంబున తనమనంబునకు నేమియుఁ దోఁచక తనతోనున్న యాఁడేనుఁగులతోఁ దాను నొక్కదారినిఁబట్టి పోవుచుండెను. అప్పుడు,

సీ. పల్వలంబుల లేఁత ♦ పచ్చిక మచ్చికఁ
జెలుల కందిచ్చు న♦చ్చికములేక
నివురుజొంపములఁ గ్రొ♦వ్విరులయుపూఁగొమ్మలఁ
బ్రాణవల్లభలకుఁ♦బాలువెట్టు
ఘనదానశీతల♦కర్ణతాళంబుల
దయితల చెమటార్చుఁ ♦ దనువు లరసి
మృదువుగాఁ గొమ్మల♦మెల్ల నిగళములు
నివురుచుఁ బ్రియముతో♦నెఱపు గఱపు

తే. పిఱుఁదు చక్కట్ల డగ్గఱి♦ప్రేమఁ జూపు
డాసి మూర్కొని దివికిఁ దొం♦డంబు సాఁపు
వెద వివేకించుఁ గ్రీడించు ♦ విశ్రమించు
మత్తమాతంగమల్లంబు♦మహిమతోడ. 23

టీ. మత్తమాతంగమల్లంబు = మదించిన యా మేటియేనుఁగు, మహిమతోడ = నేర్పుతో, పల్వలంబులన్ = పడియలయందు, (ఉండు) లేఁతపచ్చికన్, = లేఁతకసవును, మచ్చికన్ = ప్రేమతో, అచ్చికముచేర = కొఱతలేకుండ, చెలులకున్ = తనకాంతలకు, అందిచ్చున్ = తొండముచేఁ బెట్టును, ఇవురుజొంపములన్ = చిగుళ్ళగుంపులచేత, క్రొవ్విరులయు = క్రొత్తగా వికసించు, పూఁగొమ్మలన్ = పూవులతో నిండిన రెమ్మలను, ప్రాణవల్లభలకున్ = ప్రాణముతో సాటివచ్చు కాంతలకు, పాలుపెట్టున్ = పంచియిచ్చును, ఘన....తాళంబులన్, ఘన = ఎక్కువయిన, దాన = మదజలముచేత, శీతల = చల్లనైన, కర్ణ = చెవులనెడు, తాళంబులన్ = విసనకఱ్ఱలచేత, దయితలన్ = ప్రియురాండ్రను, తనువులు = దేహములు, అరసి = చూచి, చెమట + ఆర్చున్ = చెమటనుబోఁగొట్టి శ్రమదీర్చును, మృదువుగాన్ = తిన్నఁగా, కొమ్మలమెల్లనిగళములు = చానలయొక్క యందములగు కంఠములను, నివురుచున్ = తొండముతోఁ దడవుచు, ప్రియముతోన్ = ప్రేమతో, నెఱపు = వేడుకను, కఱపున్ = కలిగించును, పిఱుఁదుచక్కట్లన్ = వెనుకటిభాగములకు, డగ్గఱి = సమీపించి, ప్రేమన్ = అనురాగంబును, చూపున్ = కనఁబఱచును, డాసి = దగ్గఱకుఁ బోయి, మూర్కొని = ఆఘ్రాణించి, దివికిన్ = ఆకాశంబుపైవునకు, తొండంబు, చాఁపున్ = ఎత్తును, వెద = ఋతువును, వివేకించున్ = వెతకును, క్రీడించున్ = ఆటాడును, విశ్రమించున్ = అలసటఁ దీర్చుకొనును.

తా. ఆమత్తుఁడైన గజేంద్రుఁడు దనప్రియురాండ్రతోఁగూడఁబోవుచుఁ, దనముదితలందుఁ గలమోహముచే వానిం బచ్చికపడియలందు మొలచి యుండు లేఁతపచ్చికను దొండముతోఁ బెఱికి తనివితీఱ నొసంగుచును, జిగుళ్ళతోనిండిన రెమ్మలను దొండముతో విఱచి, పక్షపాతము లేక యన్నింటికినిచ్చుచును, వనమునందుఁదిరుగుటచేత డస్సిన తన ప్రియురాండ్ర యొడళ్ళయందలి చెమటలను విసనకఱ్ఱలఁబోలు తనచెవులతో విసరుచుఁ,

దన కాంతల యందమైన తొడలను తొండముతోఁ దడవి, తనతో విహరింప నిచ్ఛపుట్టించుచు, ముందుపోపుచున్న, తనవనితల వెనుకకుఁ బోయి, తొండములతో వానివెనుకటిభాగంబుఁ దడవి, వానిపైఁ దనకుఁగల మోహంబుఁ దెలియఁబఱచుటకై తొండములఁ బైకెత్తుచు, ఋతుకాలంబుఁ గనిపెట్టి, యావనంబులందు వానితోఁగూడ విహరించుచు నట్టి విహరించుట వలని యలసటఁ దీర్చుకొనుచుండెను.

సీ. తనకుంభములపూర్ణ ◦ తకు డిగ్గి యువతుల
కుచములు పయ్యెద ◦ కొంగు లీఁగఁ
దనయానగంభీర ◦ తకుఁ జాల కబలల
యానంబు లందెల ◦ నండఁగొనఁగఁ
దనకరశ్రీఁ గని ◦ తలఁకి బాలలచిఱు
దొడలు మేఖలదీప్తిఁ ◦ దోఁడుబిలువఁ
దనదంతరుచి కోడి ◦ తరుణులనగవులు
ముఖచంద్రదీప్తుల ◦ మునుఁగు దిగువఁ
తే. దనదులావణ్యరూపంబు ◦ దలఁచి చూడ
నంజనాభ్రము కపిలాది ◦ హరిదిభేంద్ర
దయిత లందఱు దనవెంటఁ ◦ దగిలి నడుపఁ
గుంభివిభుఁ డొప్పె నొప్పుల ◦ కుప్పవోలె. 24

టీ. తనకుంభములపూర్ణతకున్ = తనయొక్క కుంభస్థలములయొక్క నిండుఁదనమునకు, డిగ్గి = తలవాంచి, యువతులకుచములు = జవరాండ్ర స్తనంబులు, పయ్యెదకొంగులు = పైఁటచెఱఁగులను, ఈఁగన్ = తాల్పఁగా, తనయానగంభీరతకున్ = తననడతయొక్క గొప్పదనమునకు, చాలక =

సరిపోలలేక, అబలలయానంబులు = వనితలయొక్క నడకలు, అందెలన్ = కాలినూపురములను, అండఁగొనఁగన్ = ఆశ్రయింపఁగా, తనకరశ్రీన్ = తనతొండముయొక్క సొంపును, కని = చూచి, తలఁకి = వెఱచి, వాలిం చిఱుదొడలు = జవరాండ్ర చిన్నతొడలు, మేఖలదీప్తిన్ = మొలనూళ్ళ యొక్కసొంపులు, తోడుపిలువన్ = సాయమునకుఁ బిలువఁగా, తనదంత రుచికిన్ = తనదంతములకాంతికి, ఓడి, తరుణులనగవులు = ప్రాయంపు మగువలనవ్వులు, ముఖచంద్రదీప్తులన్ = చంద్రునిఁబోలు మోములయొక్క వెలుఁగులచేతను, ముసుఁగు తిగువన్ = ముసుఁగు వైచికొనఁగా, తనదు లావణ్యరూపంబున్ = తనయొక్క సౌందర్యముతోఁ గూడినరూపమును, తలఁచిచూడన్ = గమనించి చూచినంతమాత్రముననే, అంజనా... దయితలు-అంజన+అభ్రము+కపిల+ఆది = అంజన, అభ్రముపు, కపిల మొదలగు, హరిత్+ఇభ+ఇంద్ర = మేటిదిగ్గజములయొక్క, దయితలు = ప్రియురాండ్రు, అందఱును, తనవెంటన్ + తగిలి = తనవెంబడిపడి, నడువన్ = రాఁగా, కుంభివిభుఁడు = గజరాజు, ఒప్పులకుప్పవోలెన్ = సౌందర్యముయొక్క ప్రోఁగువలె, ఒప్పెన్ = ప్రకాశించుచుండెను.

తా. ఆగజరాజు తనకుంభములయొక్క గబ్బితనమునకు సరిపోలమిచే నతివలు సిగ్గుపడి, తమ స్తనంబులను పైఁటకొంగులలోఁ గప్పుకొనిరో యను నట్లుండు కుంభస్థలములును, దననడకటుఁ దగినట్లు నడువవలెనను నభి ప్రాయంబుతోఁ గాంతలు తమకాళ్ళ కందెలు దాల్చిరో యనునట్లుండు నడకయుఁ, దనతొండములకాంతిం బోలకున్నందున, అబలలు తమ తొడల కాంతి హెచ్చుటకై యొడ్యాణములఁ దాల్చిరో యని చెప్పఁదగియుండు తొండమును, దనదంతములకాంతితో సీడుగాకున్నందున నతివలు తమ చిఱునవ్వులకాంతిని తమమోముచంద్రులకాంతులతో జతపఱిచిరో యను నట్లు చెప్పఁదగిన దంతములునుగలిగి యంజన మొదలగు దిగ్గజేంద్రుల యంగనలు తనరూపలావణ్యమును జూచి మోహించి తమ ప్రియభర్తలఁ

జూసి తన్ను పెంపడించున ట్లొనర్పఁగలరూపలావణ్యముఁగలదై సౌందర్యరాశి యన నొప్పియుండెను.

వ. మఱియు నానాగహన విహరణమహిమతో మద
గజేంద్రము మార్గంబుఁ దప్పి పిపాసాపరాయత్త
చిత్తంబున మత్తకరేణుల మొత్తంబును దానునుం
జనిచని, 25

టీ. మఱియు, నానా...మహిమతో-నానా = అనేకములగు, గహన= అడవులందు, విహరణ = తిరుగుటయందలి, మహిమతోన్ = నేర్పుతో, మదగజేంద్రంబు = మదపుటేనుఁగుల ఱేఁడు, మార్గంబున్+తప్పి = దారితప్పి, పిపాసా...చిత్తంబునన్-పిపాసా = దప్పికి, పరాయత్త = మిక్కిలిలోఁబడిన, చిత్తంబునన్=మనంబుతో, మత్తకరేణులమొత్తంబును= మదించిన యాఁడేనుఁగులగుంపును, తానును, చనిచని = కడుదవ్వేఁగి.

తా. ఆగజేంద్రుఁ డట్టిసౌందర్యాతిశయంబుతోఁ గూడి, యడవి యడవిఁ దిరుగుచు, నావేడుకలోనే యుండి దారితప్పి మఱొక్కదారినిఁ బోయి, మిక్కిలి దప్పికొని, నీరుద్రావుటకై మడుఁగులను వెదకుచుఁ, దన కరేణు సమూహములతోడఁ జాలద వ్వేఁగినదై,

మ. అటఁ గాంచెం గరిణీవిభుండు నవఫుల్లాంభోజ
కల్హారమున్, నటదిందిందిరవారముం గమఠమీనగ్రాహ
దుర్వారమున్, వటహింతాల రసాలసాలసుమనోవల్లీ
కుటీతీరముం, జటులోద్ధూతమరాళ చక్రటక సంచా
రంబుఁ గాసారమున్. 26

టీ. అటన్=అచ్చట,కరిణీవిభుండు నవ....రమున్—నవఫుల్ల=అప్పు డేపూఁచిన, అంభోజ = తామరలు, కల్హారమున్ = ఎఱ్ఱదామరపువ్వులును-

గలదియు. నట.... వారమున్—నటత్ = (ఆపువ్వులపై) తిరుగుచున్న, ఇందిందిర=తుమ్మెదలయొక్క,వారమున్=గుంపుగలదియు,కమఠ. ..రమున్—కమఠ=తాఁబేళ్ళచేతను, గ్రాహ = మొసళ్ళచేతను, మీన = చేఁపలచేతను, దుర్వారమున్=దాఁటఁగూడనిదియు, వట....తీరమున్—వట = మఱ్ఱిచెట్లు, హింతాల=గిరకతాడిచెట్లు, రసాల = తియ్యమామిడిచెట్లు, సాల=ఏపెచెట్లు, సుమనోవల్లీ=జాజితీఁగెలు, కుటీ=అడవిమల్లెచెట్లు, తీరమున్ = గట్టునందు గలదియు, చటుల....చారంబున్ — చటుల = మిక్కిలి, ఉద్ధూత = దుమికెడు, మరాళ = హంసలయొక్క, చక్ర = చక్రవాకపక్షులయొక్క, బక = వక్కకొంగలయొక్కయు, సంచారంబున్ = తిరుగుటగలదియు, అయిన, కాసారమున్=కొలనిని, కాంచెన్=చూచెను.

తా. అగ్గజేంద్రుఁ డట్లు చాలద వ్వేఁగి, యప్పుడే పూచినపూలతోఁ గూడినదియు, ఆపూలపైఁ దిరుగుచుండు తుమ్మెదలచే నొప్పినదియు, మొసళ్లు మొదలగుజంతువులతోఁ గూడియున్నందున లోపలికి సైతము దిగుటకు వీలుపడనిదియు, మామిడి, మఱ్ఱి మొదలగుచెట్లతో నలుప్రక్కలం గూడినదియునై, హంస సారస కారండవాదిపక్షులచే వెలయుచున్న యొక క్కొలనిం గాంచినవాఁడాయెను.

వ. ఇట్లనన్యపురుషసంచారంబయి నిష్కళంకంబై నయప్పంకజాకరంబుఁ బొడఁగని,

టీ. ఇట్లు=ఇవ్విధంబున, అనన్యపురుషసంచారంబు+అయి=ఇతరుల సంచారములేనిదై, (కనుకనే) నిష్కళంకంబు=మురికిలేనిది, ఐన, అప్పంకజాకరంబున్=ఆతామరకొలనిని, కని,

తా. ఆయరణ్యంబున మనుష్యసంచారము లేమిచేఁ దేటనీటితోఁ గూడినదై యున్నఁ యా తామరకొలనినిఁ జూచినదాయెను. అట్లు గజేంద్రుఁ డాకొలనిం జూచి,

సీ. తోయజగంధంబు దోఁగిన చల్లని
మెల్లనిగాడ్పుల మేను లలర
కమలనాళాహార విమలవాక్కలహంస
రవములు చెవుల పండువులు సేయ
ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు
ఘ్రాణరంధ్రంబుల గారవింప
నిర్మలకల్లోలనిర్గతాసారంబు
వదనగహ్వరముల వాడుదేర్పఁ

తే. త్రిజగదభినవసౌభాగ్యదీప్తమైన
విభవ మీక్షణములకును విందుసేయ
నరిగి పంచేంద్రియవ్యవహారములను
మఱచి మత్తేభయూథంబు మడుఁగు సొచ్చె. 28

టీ. తోయజగంధంబు, తోఁగిన, చల్లని, మెల్లని గాడ్పులన్ = తామరపువ్వుల తావితోఁగూడి శైత్యమాంద్యములను గుణములు గలిగి వీచుచున్నగాలిచేత, మేనులు=దేహములు, అలరన్ = ఆనందమొందఁగా, (దీనిచేఁ ద్వగింద్రియమునకు విషయమైన స్పర్శగుణము తెలుపఁబడెను.) కమల....రవములు—కమలనాళ=తామరతూఁడులు, ఆహార = భోజనముగాఁ గలవియై, విమల=స్పష్టమైన, వాక్=మాటలుగల, కలహంస = రాయంచల యొక్క, రవములు = కూఁతలు, చెవులపండువులుచేయన్ = శ్రోత్రానందము గలిగింపఁగా, (దీనిచే శ్రోత్రేంద్రియమునకు విషయమైనశబ్దము చెప్పఁబడెను.)ఫుల్ల....మోదంబు—ఫుల్లత్=వికసించిన, ఇందీవర=నల్లకలువలయొక్క, అంభోరుహ = తామరపూవులయొక్క, ఆమోదంబు = తావి

ఘ్రాణరంధ్రంబులన్ = ముక్కుపుటములను, గారవింపఁన్ = మర్యాద సేయఁగా, (దీనిచే ఘ్రాణేంద్రియమునకు విషయమయిన గంధగుణము సూచింపఁబడియె.) నిర్మల....సాలంబు—నిర్మల = తేటయైన, కల్లోల = పెద్దయలలనుండి, నిర్గత = వెలువడిన, ఆసారంబు = జడివాన, (వ్యాపించుట), వదనగహ్వరములవాడుతేర్పన్ = నోళ్ళనెడురంధ్రముల యొక్క యెండుటను బోఁగొట్టఁగా, (దీనిచేజిహ్వేంద్రియమునకు విషయం బయిన రసగుణముఁ దెలుపఁబడియె.) త్రిజగ...దీప్తము-త్రిజగత్ = ముల్లోకములకు, అభినవ = క్రొత్తదైన, సౌభాగ్య = సొంపుచేతను, దీప్తము + అయిన = వెలుఁగుచున్న, విభవము = వేడుక, ఈక్షణము లకును = కన్నులకును, విందు = బంధుభోజనము, చేయన్=తృప్తినిఁ బొందింపఁగా, (దీనిచే నేత్రేంద్రియమునకు విషయమయిన రూపగుణము చెప్పఁబడెను.) అరిగి = పోయి, పంచేంద్రియవ్యవహారములను = త్వక్, చక్షుః, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములను నైదింద్రియములకుఁ గావలసిన స్పర్శ, రూప, శబ్ద, రస, గంధములను విషయములను మఱచి, మత్త + ఇభయూథంబు = మదపుటేనుఁగుల మేటిగుంపు, మడుఁగుచొచ్చెన్ = మడుఁగులోపలదిగెను.

తా. ఆతామరకొలఁకునుండి తామరపూలవాసనతోఁ గూడి శైత్య సౌరభ్యమాంద్యములనుమూఁడుగుణములుగల గాలివీవఁగాఁ దమదేహములు బడలిక తీఱుటచేతను, ఆకొలఁకునందలి తామరతూండ్లు మొరడి యింపుగాఁ గూయుచున్న రాయంచలకూఁతలు తమచెవుల కింపుగానుండుట చేతను, ఆకొలనియందలి తామరపువ్వులసువాసన తమముక్కులకుఁ గమ్మని వాసనకొట్టుచుండుటచేతను, తేటయైన యలలతోఁగూడ వచ్చెడు తుంపురులు నోటికి రుచికరంబై యుండుటచేతను, ఆ తామరకొలనియొక్క సొంపు ముల్లోకములకుఁ గ్రొత్తదై చూడఁజూడఁ దనివితీఱకుండుటచేతను, మామ్మదపుటేనుఁగులగుంపు తమ పంచేంద్రియములకుఁ గావలయు వానిని

మఱచి యా కొలనిలో దిగినవాఁడాయెను. పంచేంద్రియములకుఁ గావలసినశబ్ద, స్పర్శ, రూప, రస, గంధగుణంబు లైదును నక్కొలనియందే యున్నం దున నవి యాకొలనిని విడిచిపోవ మనంబురాక దానిలో దిగెను.

క. తొండంబులఁ బూరించుచు
గండంబులఁ జల్లుకొనుచు గళగళరవముల్
మెండుకొన వలుదకడుపులు
నిండ న్వేదండకోటి నీరుం ద్రావెన్. 29

టీ. వేదండకోటి = ఏనుఁగులగుంపు, తొండంబులన్=తొండముల లోపల, పూరించుచున్ = (నీటిని) నిండించుకొనుచు, గండంబులన్ = చెక్కిళ్ళయందు, చల్లుకొనుచున్, గళగళరవములు = గళగళ యను ధ్వనులు, మెండుకొనన్ = అతిశయింపఁగా, వలుదకడుపులు = తమ పెద్దబొజ్జలు, నిండన్ = నిండునట్లు, నీరున్ = నీటిని, త్రావెన్ = పానముచేసెను.

తా. ఆ యేనుఁగు లాకొలనిలో దిగి, నీటినిఁ దమతొండముల లోపలికిఁ బీల్చుకొని, పైకెత్తి గండస్థలమందుఁ జల్లుకొనుచు, తలలు పైకెత్తి, గళగళధ్వనిఁ బుట్టునట్లు చేయుచుఁ, గడుపునిండుగా నీరుఁద్రాగిన వాయెను.

వ. అప్పుడు, 30

తా. ఆ యేనుఁగు లిట్లెలఁగున నీటినిఁ ద్రాపుచు నెక్కువ సంతోషముతో నాకొలనియందు విహారములు సల్పుచుండు సమయంబున,

మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీరెక్కించి
పూరించి చంద్రభమార్గంబున నెత్తి నిక్కి
వడిశిక్కుట్టాడించి పైఁజిమ్మ నారభటి న్నీరములోనఁ

బెల్లెగసి న క్రగ్రాహపాఠీనముల్, నభమం దాడెడు
మీనకర్కటములం బట్టెన్ సురల్ ప్రమాన్పడన్. 31

టీ. ఇభలోక + ఇంద్రుఁడు = ఏనుఁగుల మేటిగుంపునకురాజు, హస్తరంధ్రములన్ = తొండముయొక్క సందులందు, నీరు, ఎక్కించి = పూరించి = నిండించి, చండభమార్గంబునకున్ = వేఁడికిరణములుగల సూర్యునిమార్గమునకు, (ఆకాశముపైపునకు), ఎత్తి = (తొండమును) పైకెత్తి, నిక్కి = మీఁగాళ్ళమీఁదనిలిచి, వడిన్ = వేగముతో, ఒప్పాడించి = కలఁగించి, పైఁజిమ్ము నారభటిన్ = పైకిచిమ్మునట్టివేగముతో, నీరము లోనన్ = ఆయేనుఁగుతొండమందలి నీటియందుండి, నక్రగ్రాహపాఠీన ముల్ = మొసళ్లు, ఎండ్రకాయలు, వేయి కోఱలుగలచేఁపలును, బెల్లు = మిక్కిలి, ఎగసి = ఎగరి, సురల్ = దేవతలు, ప్రమాన్పడన్ = నిరిచిపోవు నట్లు, నభమందున్ = ఆకసమునందు, ఆడెడు మీన కర్కటములన్ = తిరిగెడుచేఁపలను, ఎండ్రకాయలను, (ఆ రాసులననుట) పట్టెను = ఆశ్రయించెను.

తా. ఆయేనుఁగులతేఁ డాకొలనియందుఁ గ్రీడసల్పుచుఁ దొండము నిండ నీళ్ల నిండించి, పైకెత్తి యాడించి యానీటినిఁ బైకెగఁజిమ్మఁగా, నా వేగముచేఁదొండములోని నీటిలోనుండినచేఁపలు, ఎండ్రకాయలు, కొట్టులు గజేంద్రునికి వెఱచి, శత్రువులకు వెఱచినవారు గొప్పపదవియందున్న తమ వారి నాశ్రయించునట్లు, ఆకసమునందలి రింశుమారచక్రమందున్న మీనము, కర్కాటకము అను రాసులను బొందెను. అదిచూచి దేవతలందఱు నాశ్చ ర్యము నొందిరి. లోకమున శత్రువులకు వెఱచినవారు తమవారిలో గొప్ప వారి నాశ్రయించుట ప్రసిద్ధము. గజేంద్రుఁడు తనతొండమునుండి యెగఁ జిమ్మినసీరు ఆకాశమువఱకు నెగసెను. ఆగజేంద్ర మంతబలిమిఁగలదియని భావము. అతిశయోక్తి అలంకారము. స్వభావోక్తియు.

వ. మఱియు నగ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున, 32

టీ. మఱియు, ఆగజేంద్రుఁడు, నిరర్గళవిహారంబున—నిర్+అర్గళ = అడ్డులేని, విహారంబున=ఆటయందు,

తా. ఆగజరాజు ఇత్తెఱఁగున నడ్డములేకుండ విహరింపుచుండఁగా,

సీ. కరిణీకరోజ్ఝిత కంకణచ్ఛటఁ దోఁగి
సెలయేటినీలాద్రి చెలువుఁ దెగడు
హస్తినీహస్త విన్యస్తపద్మంబుల
వేయిగన్నులవాని వెరవు సూపుఁ
గలభీసముత్కీర్ణ కల్హారరజమునఁ
గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చుఁ
గుంజరీపరిచిత కుముదకాండంబుల
ఫణిరాజమండన ప్రభ వహించు

ఆ. మదకరేణుము క్తమౌ క్తికశు క్తుల
మెఱుఁగు మొగులతోడ మేలమాడు
నెదురులేనిగరిమ నిభరాజమల్లంబు
వనజగేహకేళి వ్రాలునపుడు. 33

టీ. ఇభరాజమల్లంబు = గజేంద్రులలో మేటి, ఎదురులేనిగరిమన్ = సాటిలేనిగొప్పతనముతో, వనజగేహకేళిన్—వనజ=కమలములకు, గేహ = ఉనికిపట్టగుకొలనియందు, కేళిన్=ఆటయందు, వ్రాలునపుడు=మీఱునపుడు, కరిణీ....ఛటన్ - కరిణీ = ఆఁడేనుఁగులయొక్క, కర = తొండములనుండి, ఉజ్ఝిత=పైకెగురఁగొట్టఁబడిన, కంకణ=నీటిబిందువులయొక్క, ఛటన్ =

గుంపునందు, తోఁగి = తడిసి, సెలయేటినీలాద్రిచెలువున్ = సెలయేళ్ళతోఁ గూడిన కాటుకకొండయొక్క యందమును, తెగడున్ = తిరస్కరించును, హస్తినీ....పద్మంబులన్—హస్తినీ=ఆఁడేనుఁగులయొక్క, హస్త=తొండము లచేత, విన్యస్త = ఉంచఁబడిన, పద్మములన్ = తామరపువ్వులతేకులచేత, వేయి గన్నులవానివెరవు=వేయికన్నులు గలవాఁడగు దేవేంద్రునియొక్క పోలికను, చూపున్=కనఁబఱచును, కలభీ....జమునన్—కలభీ = ప్రాయపు టాఁడేనుఁగులచేత, సముత్కీర్ణ = వెదఁజల్లఁబడిన, కల్హార = చెంగలువ పువ్వులయొక్క, రజమునన్ = పుప్పొడిచేత, కనక+అచల+ఇంద్రంబు ఘనతన్=గొప్పదైన మేరుపర్వతముయొక్క గొప్పతనమును, తాల్చున్ = వహించును, కుంజరీ....కాండంబులన్ — కుంజరీ=ఆఁడుఏనుఁగులచేత, పరిచిత=వేయఁబడిన, కుముద=తెల్లతామరపూఁడలయొక్క,కాండంబులన్= గుంపులచేత, ఫణిరాజమండనప్రభన్ = పాములే తొడవులుగాఁగల యీశ్వరునికాంతిని,వహించున్=పొందును, మద....శుక్తులన్—మదకరేణు= ఆఁడు మదపుటేనుఁగులచేత, ముక్త = వేయఁబడిన, మౌక్తికశుక్తులన్ = ముత్యపుచిప్పలచేత, మెఱుఁగు మొగులతోడన్ = మెఱపులతోఁగూడిన మబ్బులతో, మేలమాడున్=ఎగతాళులాడును.

తా. ఆ మదించినగజరాజు పెంటియేనుఁగులతోడ సాటిలేనినేర్పుతో నాకొలనియందు జలక్రీడలుసల్పునప్పుడు, ఆఁడేనుఁగులు తమతొండములతో నీళ్లెత్తి పైకిఁజల్లుటచే నానీటిబొట్లచేఁ దడిసియున్నందున, కొండసదులతోఁ గూడినకాటుకకొండయో యనఁదగియు. నవి తమతొండములతోఁ దామర పూవులతేకులు విదఁదీసి శరీరముపైఁ జల్లుటచే వేయికన్నులుగల దేవేంద్రుఁడో యనఁదగియు, అవి చెంగలువ పువ్వులపుప్పొడి చల్లుటచేఁ బసిఁడికొండయో యనఁదగియు, ఆయాఁడేనుఁగులు తెల్లతామరతూఁడులఁ బెల్లగించి తనపై వేయుటచేఁ బాములను భూషణములనుగాఁ దాల్చిన యీశ్వరుఁడోయనియు, ఆప్రియకరేణువులు ముత్యపుఁలచిప్పలు నీళ్ళలోపల

మండిమొత్తి పైనవేయుటచే మెఱపులతోఁ గూడినమబ్బోయనియుఁ దలఁపఁ దగియుండెను. ఈపద్యమునందు గజేంద్రునికిఁ గాటుకకొండతోను, మేరు పర్వతముతోను, మబ్బుతోను సామ్యంబుచెప్పుటచే నా గజేంద్రుఁ డంత యెత్తయినవాఁడని సూచిత మగుచున్నది. ఏనుఁగు నల్లగానుండుటచేతఁ బర్వతాదులతో సాటి చెప్పఁబడియె. మఱియు, నీటితుంపురలు వెలయేళ్ళ తోను, తామరతీఁకులు కన్నులతోను, జెంగలువపువ్వులపుప్పొడి బంగారు తోను, గలువకాఁడలు తెల్లనిపాములతోను, ముత్యపుచిప్పలు మెఱపులతోను సరిపోల్పఁబడినవి యనియెఱుఁగవలయును. ఈశ్వరునికిఁ దెల్లనిపాములు భూషణములనిప్రసిద్ధి. ఉత్ప్రేక్షాతిశయోక్త్యలంకారములు.

వ. మఱియు నా సరోవరలక్ష్మి మదగజేంద్ర వివిధవిహార వ్యాకులిత , నూతనలక్ష్మీవిభవ యై యనంగవిద్యా నిరూఢపల్లవ ప్రబంధ పరికంపితశరీరాలంకారయగు కుసుమకోమలియునుంబోలె వ్యాకీర్ణ చికురమత్తమధు కరనికరయు విగతరసవదనకమలయు నిజస్థానచలిత కుచరథాంగయుగళయు లంపటితజఘన పులినతలయు నై యుండె నంత, 34

టీ. మఱియును ఆ సరోవరలక్ష్మి = ఆకొలనియొక్కకాంతి, మద... విభవయు + ఐ-మదగజ + ఇంద్ర = మదించినమేటియేనుఁగులయొక్క, వివిధ = పలుతెఱఁగులైన, విహార = ఆటలచేత, వ్యాకులిత = చీకాకు పఱుపఁబడిన, నూతనలక్ష్మి = క్రొత్తకాంతియొక్క, విభవయు+ఐ = అతిశయముగలదై, అనంగ...కార అగు-అనంగవిద్యా = కామశాస్త్రము నందు, నిరూఢ = పండితులైన, పల్లవ = విటులయొక్క, ప్రబంధ = గొప్పబంధనములచేతను, పరికంపిత = వణఁకునట్లు చేయఁబడిన, శరీర+

అలంకార+అగు = మేని భూషణములుఁగలదగు, కోమలియున్+పోలెన్ = పుష్పమువంటి మెత్తని శరీరముగలకాంతవలె, (స్త్రీపరమయిన యర్థము)
1. వ్యాకీర్ణచికురమత్తమధుకరనికరయున్-వ్యాకీర్ణ=అంతటఁ బర్వియున్న, చికుర = వెంట్రుకలవంటి, మత్త = మదించిన, మధుకర = తుమ్మెదల యొక్క, నికరయున్ = గుంపుగలదియు, 2. విగతరసవదన కమలయున్-విగత=పోయిన, రస = నీరుగల, వదన = మోమువంటి, కమలయున్ = తామరపూవులుగలదియు, 3. నిజస్థానచలిత కుచరథాంగయుగళయున్-నిజస్థానచలిత = తనతావునుండికదలిన, కుచ = స్తనములవంటి, రథాంగ = జక్కవపిట్టలయొక్క, యుగళయును=దంపతులుగలదియు, 4. లంపటిత... తలయు+ఐ-లంపటిత = త్రొక్కఁబడిన, జఘన = పొత్తికడుపువంటి, పులినతలయున్ = ఇసుకతిన్నెల ప్రదేశములుగలదియునై, ఉండెను, అంత = అప్పుడు.

తా. ఇట్లు గజేంద్రునిచే నానావిధవిహారంబులు సల్పి కలఁతపెట్టఁబడిన యాసరోవరంబు కామశాస్త్రంబెల్ల నెఱిఁగినవిటుని గాఢాలింగనముచే శరీరాలంకారమెల్లఁ బోయిన స్త్రీవలె చికురమధుకరనికరయు,

స్త్రీపరమయిన యర్థము

1. వ్యాకీర్ణ = విరియఁబోసికొనఁబడిన, చికురమత్తమధుకరనికరయున్ = నల్లనితుమ్మెదలగుంపులవంటి వెంట్రుకలుగలదియు,

2. విగతరస = పీల్చుకొనిపోయిన (వాడుపాఱిన), వదన కమలయున్ = తామరపువ్వుంబోలు మోముఁగలదియు

3. నిజస్థానచలితకుచరథాంగయుగళయు-నిజస్థాన=తనచోటినుండి, చలిత = కదలిన, కుచరథాంగయుగళయున్ = చక్రవాకపక్షులంబోలెడు స్తనంబుల జంటఁ గలదియు,

4. లంపటిత = శ్రమపఱుపఁబడిన, జఘనపులినతలయున్ = ఇసుకతిన్నెవంటి కటిపురోభాగముఁ (మొలకు ముందటిభాగము) గలదియు.

విగతపసవదనకమలయు, నిజస్థానచలితకుచరథాంగయుగళయు, లంపటిత జఘనపులినతలయునై యుండెను.

ఈగద్యమున నాకొలను సురతాంతముననున్న తీరుగల యొక తరుణితోసాటిగా వర్ణింపఁబడినది. ఒకకాముకురాలు కామశాస్త్రంబెల్ల నెఱిఁగిన విటునితో రమించినపుడు అతనిగట్టికౌఁగిలింతచే శరీరశోభ తగ్గియుండును. తుమ్మెదలంబోలు తమవెండ్రుకలు విరియఁబోసికొని యుండును. చక్రవాకంబులవలె నొకటితో నొకటి చేరియున్న స్తనంబులు తమతావునుండి తొలఁగి యదురుచుండును. ఇసుకతిన్నెలవంటి మొలకు ముందటిభాగం బడుగున కంటుకొనిపోయియుండును. అట్లె యీకొలనును మత్తగజేంద్రునిచేఁ గలియఁబెట్టఁబడినందున వెండ్రుకలవలెనుండు తుమ్మెద లచ్చటం దిరుగుచుండినవి. ఏనుఁగులు గలియఁబెట్టి పీఁకివేయుటచేఁ దామర తీఁగ లన్నియు తడిలేమిచే నొప్పకుండెను. స్తనంబులవలెఁ జేరియున్న చక్రవాకము లీయేనుఁగుల తొండములకు వెఱచి యెడమెడముగా నుండినవి. ఆ కొలనియందలి యిసుకతిన్నె లన్నియు నా గజయూథంబుల కాలి త్రొక్కుళ్ళచేఁ బాడై పోయియుండును.

సీ. భుగభుగాయితభూరిబుద్బుదచ్ఛటలతో
గదలుచో దివికి భంగంబు లెగయ
భువనభయంకరఫూత్కారరవమున
ఘోరనక్రగ్రాహకోటి బెగడ
వాలవిక్షేపదుర్వారఝుంఝూనిల
వశమున ఘుమఘుమావర్త మడరఁ
గల్లోలజాలసంఘట్టనంబులఁ దటీ
తరు లమూలంబులై ధరణిఁ గూల

తే. సరసిలోఁ నుండి పొడగని సంభ్రమించి
యుదరి కుప్పించి లంఘించి హుంకరించి
భానుఁ గబళించి పట్టు స్వర్భానుపగిది
నొక్కమకరేంద్రుఁ డిభరాజు నొడిసి పట్టె. 35

టీ. ఒక్క-మకర+ఇంద్రుఁడు=ఒక మొసల్లి ఱేఁడు, ఘుగ...చ్ఛటల తోన్ – ఘుగఘుగాయిత = ఘుగఘుగయని శబ్దించెడు, భూరిబుద్బుదచ్ఛటలతోన్ = గొప్పబుడగలగుంపులతో, కదలుచోన్ = కదలునప్పుడు, దివికిన్ = ఆకసంబునకు, భంగంబులు = అలలు, ఎగయన్ = లేవఁగా, భువనభయంకరఫూత్కారరవమునన్ = లోకములకు వెఱపు పుట్టించు ఫూత్కారధ్వనితో, ఘోర...కోటి-ఘోర = దిగులుపుట్టించు, నక్ర = మొసళ్ళయొక్కయు, గ్రాహ = ఎండ్రకాయలయొక్కయు, కోటి=గుంపు, బెగడన్ = బెదరఁగా, వాల...వశమునన్-వాల = తోకయొక్క, విక్షేప= విసరుటచేతను, (గలిగిన) దుర్వార=అడ్డగింపరాని, ఝంఝూనిలవశమునన్ =పెనుగాలి వలన, ఘుమఘుమ+ఆవర్తము = గొప్పధ్వనులతోఁగూడిన సుడులు, అడరన్ = రేగఁగా, కల్లోలజాలసంఘట్టనంబులన్=గొప్పయలల గుంపులయొక్క తాఁకుళ్ళచేతను, తటీతరులు = గట్టునందలి వృక్షములు, అమూలంబులు+ఐ = మొదళ్ళులేనివై, ధరణిన్=నేలయందు, కూలన్= కూలఁగా, సరసిలోన్+ఉండి = కొలనినుండి, పొడగని = చూచి, సంభ్రమించి = తొందరపడి, ఉదరి = ఉలికిపడి, కుప్పించి = ఊపిరి బిగఁబట్టి, లంఘించి = దుమికి, హుంకరించి = రొప్పి, భానున్=సూర్యుని, కబళించి పట్టు=ముద్దచేసి పట్టుకొను, స్వర్భానుపగిదిన్=రాహువువలె, ఇభరాజున్ = ఆగజేంద్రుని, ఒడిసిపట్టెన్ = ఎగిరిపట్టుకొనెను.

తా. అట్లు గజేంద్రుఁడు తన ప్రియకాంతలతోఁ గూడి యక్కొలని యందు విహరించుచుండఁగా, నాకొలనియందేయున్న యొకమకరేంద్రుఁడు

వెఱచి, పైకివచ్చెడు వేగంబున గొప్పయలలు భుగభుగయనెడుధ్వనులు గల బుడబుడలతోఁగూడ వీచుచుండఁగా, స్వకీయంబగు ఫూత్కారధ్వనులతోడ గొప్పమొసళ్ళను, ఎండ్రికలును బెదరుచుండఁగా, తనతోఁకవిసరుటచేఁగలిగిన యడ్డుఁపరాని గొప్పగాలివీచుటచే గొప్పధ్వనులతోఁగూడ సుడులు ఏర్పడఁగా, గొప్పయలలువీచి గట్టుఁగోయుటచే నచ్చటనున్న చెట్లన్నియు వ్రేళ్లతెగి నేలఁగూలఁగా, కొలనినుండి పైకివచ్చి, తత్తరపాటును, వెఱపును బొంది యూపిరి బిగియఁబట్టి యొప్పుచు నాగజేంద్రంబు చెంతఁజేరి రాహువు సూర్యుని మ్రింగుటకై పట్టునట్లుగా నా గజేంద్రునిపై లొడిసి పట్టుకొనెను.

క. వడిఁ దప్పించి కరీంద్రుఁడు
నిడుదకరం బెత్తి వ్రేయ నీరాటంబుం
బొడవడగినట్లు జలములఁ
బడి కడువడిఁ బట్టెఁ బూర్వపదయుగళంబున్. 36

టీ. కరీంద్రుఁడు = ఏనుఁగులదొర, వడిన్ = వేగముగా, తప్పించి = తనకాలు దొరకకుండునట్లు చేసికొని, నిడుదకరంబు = నిడుపాటితొండంబును, ఎత్తి = పైకెత్తి, వ్రేయన్ = ఏటువేయఁగా, నీరాటంబును = ఆమొసలియు, పొడవడఁగినట్లు = నశించినట్లు, జలములన్ = నీటిలోపల, పడి = చొచ్చి, కడువడిన్ = మిక్కిలివేగముతో, పూర్వపదయుగళంబున్ = ముందటికాళ్ళనురెంటిని, పట్టెన్ = పట్టుకొనెను.

తా. ఆమొసలితేఁడు గజేంద్రునిఁ బట్టుకొనఁగానే, యా గజరాజు దానికిఁ దనకాళ్లు చిక్కకుండుటకై తనతొండముఁ బైకెత్తి యొకదెబ్బ కొట్టెను. ఆమకరరాజు దానితొండము దెబ్బరుఁ జచ్చినదానివలె నీళ్ళలోపలికిఁ బోయి, మఱల తటుక్కునఁ బైకివచ్చి రెండుకాళ్ళను బట్టుకొనెను.

చ. పదములు వట్టినం దలఁకుపా టొకయింతయులేక
శూరతన్, మదగజవల్లభుండు ధృతిమంతుఁడు
దంతయుగాంతఘట్టనన్, జెదరఁగఁ జిమ్మ నమ్మకరి
చిప్పలు పాదులు దప్ప నొప్పఱన్, వదలి జలగ్రహంబు
కరివాలము మూలముఁ జీరె గోరులన్. 37

టీ. ధృతిమంతుఁడు = ధైర్యముగలవాఁడగు, మదగజవల్లభుండు = మదపుటేనుఁగుల రాయఁడు, పదములు = తన (ముందటి) కాళ్లు, పట్టినన్ = (మొసలి) పట్టుకొనఁగా, తలఁకుపాటు = భయము, ఒకయింతయున్ = కొంచెమయినను, లేక, శూరతన్ = ధైర్యముతో, దంతయుగ + అంతఘట్టనన్ = తనదంతములు రెంటియొక్క కొనలతోఁ బొడుచుటచేత, అమ్మకరి చిప్పలు = ఆమొసలియొక్క యొడలియందలి బుడుపులు, పాదులు దప్పన్ = కుదుళ్లు తొలఁగిపోవునట్లును, ఒప్పు + అఱన్ = మాఱురూపునొందునట్లును, చెదరఁగన్ + చిమ్మన్ = చెదరిపోవునట్లు విసరఁగా, జలగ్రహంబు = మొసలి, వదలి = (కాలు) విడిచి, కరివాలముమూలమున్ = ఏనుఁగు తోఁకయొక్క మొదటిని, గోరులన్ = గోళ్ళతో, చీరెను = గీఱెను.

తా. అట్లు మకరరాజు తనముందటికాళ్ళను రెంటిని బట్టికొన్నను, వెఱవక యా యేనుఁగులరాయఁడు తనదంతములతో నామొసలియొక్క వీఁపుమీఁది బుడుపులు పట్లు తొలఁగిపోవునట్లు క్రుమ్మెను. అట్లు క్రుమ్మిన పిదప నామొసలితేఁడు ఏనుఁగుయొక్క ముందటికాళ్ళను వదలిపెట్టి వెనుకకువచ్చి తోఁకను దనగోళ్ళతో గీఱెను.

క. కరిఁ దిగుచు మకరి సరసికిఁ
గరి దరికిని మకరిఁ దిగుచుఁ గరకరి బెరయన్

గరికి మకరి మకరికిఁ గరి
భర మనుచును నతలకుతలభటు లరుదుపడన్. 38

టీ. కరికిన్ = ఏనుఁగునకు, మకరి = మొసలియును, మకరికిన్ = మొసలికి, కరి = ఏనుఁగును, భరము+అనుచును = గొప్పది యనుచును, అతలకుతలభటులు = పాతాళలోకమందును భూలోకంబునందు నుండెడి భటులు, అరుదుపడన్ = ఆశ్చర్యపడునట్లు, మకరి = మొసలి, కరిన్ = ఏనుఁగును, సరసికిన్ = కొలనిలోపలికి, తిగుచున్ = ఈడ్చును; కరకరి = ద్వేషము, బెరయన్ = హెచ్చునట్లు, కరి = ఏనుఁగు, మకరిన్ = మొసలిని, దరికిని = ఒడ్డునకు, తిగుచున్ = ఈడ్చును.

తా. ఇట్లు లొండొరులపైఁ బగ హెచ్చునట్లు మొసలి ఏనుఁగును గొలనిలోపలి కీడ్చుచుండెను. ఏనుఁగు మొసలినిఁ బైకీడ్చుచుండెను. ఇట్లొక్కదానికి నొక్కటి వెఱవక యీడ్చుటఁజూచి, నీటిలోపలనున్న మొసళ్లు గజమునకంటె మొసలిబలిమిఁగలదనితలఁచినవి. గజముమొసలినిఁ బైకిలాగుటను జూచి, యేనుఁగులన్నియు మొసలికంటె నేనుఁగు మిక్కిలి బలిమిఁగలది అని తలఁచినవాయెను.

వ. ఇట్లు కరిమకరంబులు రెండును నొండొంట సముద్దండ దండంబులై తలపడి నిఖిలలోకాలోకనభీకరంబులై యన్యోన్య విజయశ్రీవశీకరంబు లయి సంక్షోభిత కమలా కరంబులై హరిహరియును గిరిగిరియునుం దాఁకి పిఱు తివియక పెనంగు తెఱంగున నీరాటం బయిన పోరాటంబునం బట్టుచు వెలికి లోనికిందిగుచుచుఁ గొలఁకుకలంకంబొందఁ గడువడి నిట్టట్టు వడి తడఁబడక

బుడబుడానుకారంబులై బుగులు బుగుల్లను చప్పుళ్ళతో నురువులు గట్టుచు జలంబు లుప్పరం బెగయం జప్ప రించుచు వదనగహ్వారంబులనప్పళించుచు నిశితనితాంత దురంతదంతకుంతంబుల నింతింతలు తునియ లయి నెప్పళ్ళంబునం బునుకచిప్పలు పుదుళ్లు దప్పి రక్తంబులు గ్రమ్ముదేఱ హుమ్మనియొక్కుమ్మడిం జిమ్ముచు నితరేతర సమాకర్షణంబులం గదలక పదంబుల మొదలిపట్లు వదలక కుదురై యుండుచుఁ బరిభ్రమణవేగంబున జలంబులం దిరుగుచుఁ గమఠకర్కటగండకమండూకాది సలిలనిలయంబులప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిఁ దాఁకు రభసంబున నిక్కలు చెడ మ్రక్కం ద్రొక్కుచు మెండుచెడి బెండువడి నాఁచుగుల్లచిప్పలతండంబులఁ బరస్పరతాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు నోలమాసఁ గొనక గెలుపు తలంపులు బెట్టిదంబులై రెట్టింప నహో రాత్రంబులంబోలెఁ గ్రమక్రమ విజృంభమాణంబులయి బహుకాలకలహసన్నాహంబులై నిర్గతనిద్రాహారంబులై యవక్రపరాక్రమఘోరంబులై పోరుచున్న సమ యంబున, 39

టీ. ఇట్లు, కరిమకరంబులు రెండును = ఏనుఁగును మొసలియు, ఒండు + ఒండు + అ = క్రమక్రమముగా, సముద్దండదండములు + ఐ = మిక్కిలి యోర్వరాని బాధఁగలవై, తలఁపడి = రేఁగి, విఖిల...

రంబులై - నిఖిలలోక = జనులందఱియొక్క, ఆలోకన = చూపులకు భీకరంబులై = వెఱపునుగలిగించునవియై, అన్యోన్య...కరంబులయి — అన్యోన్య = ఒండొరులయొక్క, విజయశ్రీ = గెల్పుటయనులక్ష్మిని, వశీకరంబులై = లోఁబఱచుకొనుచున్నవై, సంక్షోభితకమల+ఆకరంబులై = తామరకొలనిని గలఁతపెట్టుచున్నవియై, హరిహరియు = సింహముతో సింహమును, గిరిగిరియున్ = కొండతోఁ గొండయును, తాఁకి = ఎదుర్కొని, పిఱుతివియక = వెనుదీయక, పెనంగు తెఱంగునన్ = పెనఁగులాడునట్లు, నీర + ఆటంబయిన = నీటిలో జరుగునట్టి, పోరాటంబునన్ = జగడంబుచే, పట్టుచున్ = ఒకటితో నొకటిపట్టుకొనుచు, వెలికిన్ = వెలుపలికిని, లోనికిన్=లోపలికిని, తిగుచుచున్ = ఈడ్చుచు, కొలను = తాముపోరుచున్న తామరకొలను, కలంకంబు + ఒందన్ = కలఁకపాలునట్లు, కడుపడిన్ = మిక్కిలివేగముతో, ఇట్టు + అట్టుపడి = ఈవైపునకు నావైపునకు దొర్లి, తడఁబడక = తొట్రుపాటునొందక, బుడబుడ + అనుకారంబులై =బుడబుడ యనుధ్వనింబోలినవై, బుగుల్ + బుగుల్ + అనుచప్పుళ్ళతోన్ = బుగుల్బుగుల్లనుధ్వనులతో, నురువులు గట్టుచున్ = నురుగులేర్పడునట్లుచేయుచు, జలంబులు = నీళ్ళు, ఉప్పరంబునకు = ఆకాశమునకు, చప్పరించుచున్ = ధ్వనింపఁజేయుచును, పుష్కరగహ్వరంబులను = నోటిరంధ్రములతో, అప్పళించుచున్ = పట్టుచు, నిశిత ..కుంతంబులన్ - నిశిత = వాడియైన, నితాంత = మిక్కిలి, దురంత = గెల్వ నలవికాని, దంతకుంతంబులన్ = దంతములనెడు బల్లెములచేతను, (బల్లెములవంటి దంతములచేతను) ఇంతింతలు = చిన్న చిన్నవియగు, తునియలు + ఐ = తునుకలై, వెప్పశంబునన్=వేగముతో, పుసురచిప్పలు = తలపుర్రెలు, కుదుళ్ళుతప్పి = తావుతొలఁగి, రక్తంబులు గ్రమ్మదేఱన్ = నెత్తురుకాఱఁగా, హుమ్ + అని, ఒక్క + ఉమ్మడిన్= పూనికతో, చిమ్ముచున్ = ఎగుఱఁగొట్టుచు, ఇతర + ఇతరసమాకర్షణంబులన్ = ఒండొరుల నీడ్చుకొనుటచేత, కదలక, పదంబులమొదలి

పట్టు = పాదములయొక్క తాము మొదటనుంచినపట్టును, వదలక = విడువక, కుదురు + ఐ + ఉండుచున్ = స్థావరముగానుండుచు, పరిభ్రమణ వేగంబునన్ = సుళ్ళయొక్కవేగముచే, జలంబులన్=నీటియందు, తిరుగుచున్, కమఠ....ప్రాణంబులు - కమఠ = తాఁబేళ్ళు, కర్కట = ఎండ్రకాయలు, గండక = ఒకదినుసుచేఁపలు, మండూక = కప్పలు, ఆది= మొదలుగాఁగల, సలిలనిలయ = జలజంతువులయొక్క, ప్రాణంబులు = ప్రాణములు, క్షీణంబులుగాన్ = నశించునట్లు, ఒండొంటిన్ = ఒకదాని నొకటి, తాఁకురభసంబునన్=ఎదిరించునట్టివేగముచేత, ఇక్కలు చెడన్ = తావరములు తొలఁగిపోవునట్లు, ముక్కన్ + త్రొక్కుచున్ = చావఁద్రొక్కుచు, మెండుచెడి = అతిశయముతగ్గి, బెండువడి = బలహీనములయి, నాఁచుగుల్ల చిప్పలతండంబులన్ - నాఁచు = నీటిపాఁచియొక్కయు, గుల్ల = నత్తగుల్లలయొక్కయు, చిప్పల = కప్పచిప్పలయొక్కయు, తండంబులన్ = గుంపులను, పరస్పర తాడనంబులకున్ = ఒండొరుల దెబ్బలకు, అడ్డంబుగాన్ + ఒడ్డుచున్=అడ్డముగా నిలుచుచు, ఓలమాసఁగొనక=వెనుదీయుట కిష్టపడక, గెలుపుతలంపులు = జయించుటయందలి యాశలు, (నేను జయింపవలెను నేను జయింపవలయు ననెడి యాశలు), బెట్టిదంబులయి రెట్టింపన్ = దృఢముగా నినుమడింపఁగా, అహోరాత్రంబులుం బోలె = రాత్రింబగళ్ళవలె, క్రమక్రమ విజృంభమాణంబులై = రానురాను రేఁగినవై, బహుకాల కలహసన్నాహంబులయి = చిరకాలము యుద్ధసన్నాహంబులు గలవై, నిర్గత నిద్రాహారంబులు + ఐ = నిద్ర, ఆహారము అనురెంటిని మానినవై, అవక్ర....బులయి - అవక్ర = సాటిలేని, పరాక్రమ = మగటిమిచే, ఘోరంబులై వెలిపించునవై, పోరుచున్న సమయంబునన్ = కయ్యము సేయునప్పుడు,

క. జవమును జలమును బలమును

వివిధములుగఁ బోరు కరటి కీ వీరతకు భువిన్

దివి మకరమీనకర్కట
నివహము లొక్కటన మిత్రనిలయముఁ బొందెన్. 40

టీ. జవమును=వేగమును, చలమును = పట్టుదలయు, బలమును= బలిమియు, వివిధములుగాన్ = పలువిధములుగా, పోరుకరటిపీరతకున్ = పోరు చేయునట్టి యేనుఁగుయొక్క శౌర్యమునుజూచి, భువిన్ = భూమి యందును, దివిన్ = ఆకాశమునందును, (ఉండునట్టి) మకరమీనకర్కట నివహములు = మొసళ్ళయు, చేఁపలయు, నెండ్రకాయలగుంపులు, మిత్ర నిలయమున్ = సూర్యుని మండలమును, (స్నేహితునియింటిని అని మఱియొక యర్థము) పొందెన్ = ప్రవేశించెను. (ప్రవేశించెనో యను నట్లుండెను.)

తా. ఇత్తెఱంగున వేగంబును, బట్టుదలయు, బలిమియుఁగలిగి, నానా విధంబులుగాఁ బోరాడుచుండఁగా, వాని పరాక్రమంబునకు వెఱచినవై భూమ్యాకాశములందుండెడి మకరమీనకర్కటములు మిత్రనిలయంబును జొచ్చినవోయనునట్లుండెను. అనఁగా మకరమీనకర్కటములు రాసులకును జంతువులకు నభేదాధ్యవసాయము. కావున మకరమీనకర్కటములే యిక్కడి యేనుఁగుపరాక్రమంబునకు వెఱచి, యాకసంబునకుఁజేరినవో యని తలఁచు నట్లుగా నుండెను. మకరము = మకరరాశి, మొసలి, మీన = మీనరాశి, చేఁప, కర్కటము = కటకరాశి, ఎండ్రకాయ, లోకంబున నాపద లొందిన వారు శత్రువులవారి కోర్వలేక మిత్రుని (చెలికాని) యింటికిఁ దోవుదురు. అట్లే భూమ్యాకాశములనుండిన మకరమీనకర్కటములు మిత్రనిలయమును బొంది యచ్చట రాశిచక్రములోఁ జేరి మకరమీనకర్కటరాసులుగా నేర్పడి యున్నవో యనునట్లుండెను.

ఈపద్యమున—సూర్యుని మండలమునందుండు మకరమీనకర్కట ములు వనంబునుండి గజరాజునకు వెఱచి పైకిఁబోయిన మకరమీనకర్కట ములో యని వర్ణించుటచే నుత్ప్రేక్షాలంకారము.

శా. ఆటోపంబునఁ జిమ్ము బొమ్మగల వజ్రాభీలదంతం
బులన్, దాటించున్ మెడఁజుట్టిపట్టిహరిదోర్దండాభ
శుండాహతిన్, నీటన్ మాటికిమాటికిం దిగువఁగా నీరా
టమున్ నీటిపో, రాటం దోటమిపాటుఁజూపుట కర
ణ్యాటంబు వాచాటమై. 41

టీ. నీటన్ = నీటిలోనికి, మాటికిమాటికిన్ = పలుమాఱు, దిగువఁగాన్ = ఈడ్వఁగా, నీరాటమున్ = (అట్లు ఈడ్చెడు) మొసలిని, నీటిపోరాటందున్ = నీటియందుఁ జేసెడు యుద్ధమున, ఓటమిపాటు=అపజయమును, చూపుటకున్ = కనఁబఱచుటకు, అరణ్యాటంబు = అడవియందుఁ దిరిగెడి గజేంద్రము, వాచాటమై=డంబపుఁబలుకులు పలుకునదియై, ఆటోపంబునన్= ఆడంబరముతో, బొమ్మ+అగలన్ = బొమ్మపగులునట్లు, వజ్ర+అభీల దంతంబులన్ = వజ్రాయుధములవలె నోర్వరానిదంతములతో, చిమ్మున్= ఎగురఁగొట్టును, హరి....హతిన్ - హరి = విష్ణువుయొక్క, దోర్దండ=దండములనుబోలు చేతులయొక్క, ఆభ = కాంతివంటికాంతిఁగల, శుండా = తొండముతో, ఆహతిన్ = కొట్టుటచేతను, మెడన్+చుట్టిపట్టి = మెడచుట్టిఁ జుట్టిపట్టుకొని, తాటించున్ = మోఁదును.

తా. ఆమకరంబు మాటిమాటికి గజేంద్రుని నీటిలోపలికి ఈడ్వఁగా గజేంద్ర మా మకరంబుతో నీటియుద్ధంబునందును వెనుదీయక యా మకరంబు నోడఁగొట్టఁబూనినదై, డంబములాడుచు మిక్కిలి భయంకరముగా వజ్రాయుధంబుఁబోలు తనదంతములతో దానిబొమ్మ పగులునట్లు ఎగురఁగొట్టెను. తొండముతో మెడకుఁ జుట్టుకొని కొట్టుచుండెను.

. అప్పుడు, . 42

తా. అవ్విధంబున గజరాజు మొసలితో యుద్ధముచేయుచున్నప్పుడు. (పైపద్యముతో నన్వయము.)

ఆ. మకరితోడఁ బోరు ॥ మాతంగవిభుని నొ
క్కరుని విడచి పోవఁ ॥ గాళ్ళు రాక
కోరి చూచుచుండెఁ ॥ గుంజరీయూథంబు
మగలు తగులు గారె ॥ మగువలకును. 43

టీ. కుంజరీయూథంబు = పెంటియేనుఁగులగుంపు, మకరితోడన్ = మొసలితో, పోరు = జగడమాడు, మాతంగవిభునిన్ = గజేంద్రుని, ఒక్కరునిన్ = ఒంటరిగా, విడచి, పోవన్ = పోవుటకు, కాళ్లురాక = రాకాలక, కోరి = (ప్రమభర్త జయంబు నొందునుగాక యని) యపేక్షించి, చూచుచుండెను, మగలు = భర్తలు, మగువలకున్ = (తమ) ప్రియురాండ్రకు, తగులుగారె = తగులాటముకదా!

తా. అట్లు మకరేంద్రునితోఁ బోరాడుచుండు తమప్రియుని గజేంద్రునిఁబాసి పోఁజాలక యాఁడేనుఁగులన్నియుఁ దమవల్లభుఁడే జయము నొందవలయునని కోరుచు నచ్చటనేయుండినవి. లోకంబునఁ గాంతలు తమ భర్తలను బాసిపోఁజాలరనువాడుక నిజమేకదా! అర్థాంతరన్యాసాలంకారము.

వ. అంత, 44

తా. అట్లుండునప్పుడు,

ఆ. జీవనంబు తనకు ॥ జీవనంబై యుంట
నలవుఁ జలము నంత ॥ కంతకెక్కె
మకర మొప్పె డస్సె ॥ మత్తేభమల్లంబు
బహుళపక్షశీత ॥ భానుపగిది. 45

టీ. జీవనంబు = నీరు, తనకున్ = మొసలికి, జీవనంబై + ఉంటన్ = ప్రాణాధారమయినదిగా నుండుటచేత, అలవున్ = బలమును, చలమును =

పట్టుదలయు = అంతకుఁ + అంతకున్ = అప్పటి కప్పటికి, ఎక్కి = అతిశయించుటచే, మకరము, ఒప్పెఁ. = ప్రకాశించెను, మత్తేభమల్లంబు= మదగజరాజు, బహుళ...పగిదిఁ - బహుళపక్ష = కృష్ణపక్షమందలి, శీతభానుపగిదిఁ = చంద్రునివలె, డస్సెన్ = క్షీణించెను.

తా. మొసలికి నీళ్లే తనయునికిపట్టగుటచేత, దానికి రానురాను బలిమియు, నుత్సాహమును హెచ్చెను. గజేంద్రుని కది పోరుగుచోటు గావున నది మకరంబుతోఁ బోరాడఁజాలక, కృష్ణపక్షమందలి చంద్రునివలె నానాఁటికి క్షీణదశ నొందెను.

మ. ఉఱుకుం గుంభయుగంబుపైహరి క్రియన్ ఘూంకారించుఁ
బాదంబుల, న్నెఱయుంగంఠము వెన్నుదన్ను నెగయున్ హేలాగతిన్వాలముం, జఱచు న్నుగ్గుగఁ దాఁకు ముంచు
మునుఁగున్ శల్యంబులుం దంతముల్, విఱుగన్ వ్రేయు
చుఁ బొంచి పొంచి కదియున్ వేదండయూథోత్తమున్.

టీ. (మకరంబు) హరిక్రియన్=సింగమువలె, కుంభయుగంబుపైన్= (ఆగజరాజుయొక్క) రెండుకుంభస్థలములమీఁదికి, ఉఱుకున్ = దుముకును, ఘుమ్+అంచున్ = హుంకారముచేయుచు, (ఱొప్పుచు), పాదంబులన్ = కాళ్లను, నెఱయున్ = వ్యాపించును, (పట్టుకొనును), కంఠమున్ = మెడను, వెన్నును = వీఁపును, తన్నుఁ = తోఁకతోఁగొట్టును, హేలా గతిన్ = విలాసముతో, ఎగయున్ = పైకెగురును, వాలముఁ = తోఁకను, చఱచున్ = కొట్టును, నుగ్గుగన్ = పొడియగునట్లు, తాఁకుఁ = కొట్టును, వేదండయూథ+ఉత్తమున్ = ఏనుఁగులగుంపులలో మేటిని, ముంచున్ = లోపలి కీడ్చుకొనిపోవును, మునుఁగుఁ = తానును దానితోఁగూడ లోపలికిఁ బోవును, శల్యములుఁ = ఎముకలును, దంతములును, విఱుగఁ =

కునుఁగునట్లు, (వ్రేయుచున్ = కొట్టుచు, పొంచిపొంచి = కనిపెట్టికనిపెట్టి, (లదిలేచిపోవుటనుజూచి) కదియున్ = సమీపించును.

తా అప్పు డామొసళ్ళరాయఁడు ఆగజేంద్రునియొక్క కుంభస్థలంబులమీదికి సింగముకైపడి నెగిరి దుముకుచుఁబాదములను హుంకారముతోఁ బట్టుకొని నీటిలోపలికి లాగును. మెడమీఁదను వీపుమీదను గొట్టుచు, అలక్ష్యముగా దానిపై కెగురును, నేనుఁగును నీళ్ళలో ముంచునుఁ, దానును మునుఁగును, నెముకలును, దంతములును విఱుగునట్లు గొట్టుచు, నుండి యుండి యది గట్టునకుఁ బోవుతఱి చూచి కాళ్ళుపట్టుకొని లోపలి కీడ్చుచు నాగజేంద్రుని బాధింపుచుండె.

మ. పొడగానం బడకుండ డాఁగు వెలికిం బోవంగఁ దా
నడ్డమై, పొడచూపుం జరణంబులం బెనఁగొనుం బో
రాక రారాక బె, గ్గడిలం గూలఁగఁ దాఁచు లేచుతఱి
నుద్ఘాటించు లంఘించు బ, ల్విడిఁ జీరుం దలఁగున్
మలంగు నొడియుకన్వేధించుఁ గ్రోధించుచున్. 47

టీ. (మకరము) పొడగానంబడకుండన్ = తనపోవడి తెలియకుండులాగున, డాఁగున్ = నీటిలో డాఁగును, వెలికిన్ = బయటికి, పోవంగన్ = (ఏనుఁగు) బయలుదేఱిపోవఁగా, తాను, అడ్డమై పొడచూపున్ = అడ్డపడి తనరూపుఁ గనఁబఱచును, చరణంబులన్ = కాళ్ళను, పెనఁగొనున్ = చుట్టివేసికొనును, బోరాక = పైకిపోనీయక, రారాక = లోపలికిరానీయక, బెగ్గడిలన్ = భీతినిఁజెంది, కూలఁగన్ = చతికిలఁబడునట్లు, తాఁచున్ = అదఁచును, లేచుతఱిన్ = లేచు సమయంబున, ఉద్ఘాటించున్ = ఔొప్పును, లంఘించున్ = దుముకును, బల్విడిన్ = మిక్కుటమయినమగఁటిమితో, చీరున్ = తగపులాట కీడ్చును, తలఁగున్= (ఏనుఁగులరాయఁడు తనపైకివచ్చినప్పుడు) తొలఁగిపోవును, మలంగున్ =

వెనుకకుఁ బోవును, ఒడెయున్ = పూనును, క్రోధించెన్ = రేఁగుచును వేధించున్ = బాధించును.

తా. మకరము గజరాజునకుఁ గనఁబడకుండ నీటిలో దాఁగుచు నా యేనుఁగు పైకిఁ బోవుతరుణంబుఁజూచి దాని కడ్డపడుచుఁ గదలనీయక కాళ్ళను జుట్టుకొనుచు నగ్గజేంద్రుఁడు వెఱచి చతికిలఁబడునట్లుగా నడంచుచు నది నీటిలోపలినుండి లేమనప్పు డెదురువడి దొప్పుచుఁ దనబల్మి మెఱయఁ దగవులాట కీడ్చుచుం దనపైకి వచ్చునప్పుడు నీటిలోఁ దొలఁగి పోవుచు నాగజేంద్రుని కాళ్ళ నొడిసిపట్టుకొనుచు బాధింపుచుండెను.

వ. ఇట్లు విస్మితనక్రచక్రంబయి నిర్వక్రవిక్రమంబున నల్ప హృదయజ్ఞానదీపంబు నతిక్రమించు మహామాయాంధ కారంబునుంబోలె నంతకంతకు నుత్సాహకలహ సన్నాహ బహువిధ జలావగాహంబయిన గ్రాహంబును మహాసాహసంబున, 48

టీ. ఇట్లు, విస్మితనక్రచక్రంబు + ఐ=అచ్చెరువొందిన జలజంతువుల సమూహంబుగలదై, నిర్వక్రవిక్రమంబునన్ = అడ్డులేని శౌర్యముచే, అల్ప .... నుం బోలెన్ - అల్పహృదయ = నీచుల మనసునందలి, జ్ఞాన = తెలివియనెడు, దీపంబున్ = దీపమును, అతిక్రమించు = దాఁటెడు. మహత్ = గొప్ప, మాయ = అజ్ఞానమనెడి, అంధకారమునుంబోలెన్ = చీఁకటివలె, అంతకున్ + అంతకున్ = అప్పటికప్పటికి, ఉత్సాహ .... గాహంబు + అగు - ఉత్సాహ = మక్కువతోఁగూడిన, కలహసన్నాహ= యుద్ధప్రయత్నముఁగల, బహువిధ= నానావిధంబులైన, జలావగాహంబు+ అయిన = నీటిలో మునుఁగుటఁగల, గ్రాహంబును = మొసలి, మహాసాహసంబునన్ = మిక్కిలి తెంపుతో.

తా. ఇట్లు గున నా మొసలి జలజంతువులన్నియు నాశ్చర్యపడునట్లు అగ్నియొక్క జ్ఞానదీపమును గ్రమ్ముకొనెడి గొప్ప యజ్ఞానమనెడి తమమువోలె నప్పటికప్పటికి హెచ్చు నుత్సాహముఁగలదై మిక్కిలి తెగువతోఁ గూడి,

శా. పాదద్వంద్వము నేల మోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మాఱాకు హత్తించి ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనగతిన్ క్రీడించుయోగీంద్రుమ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంతినిర్వక్రమై.

టీ. నక్రము = మొసలి, పాదద్వంద్వము = రెండుకాళ్ళను, నేలన్ = పుడమిపైన, మోపి = ఊని, పవనున్ = ఊపిరిని, బంధించి = బిగియఁబట్టి, పంచ + ఇంద్రియ + ఉన్మాదంబున్ = అయిదింద్రియముల యొక్క గర్వమును, పరిమార్చి = పోఁగొట్టి, బుద్ధిలతకున్ = బుద్ధియను తీఁగెకు, మాఱాకు = ప్రాకుఁడు గొయ్యను, హత్తించి = నాటి, నిష్ఖే ... గతిన్ - నిష్ఖేద = విచారములేని, బ్రహ్మపద = మోక్షముయొక్క అవలంబనగతిన్ = ఆశ్రయించుతీరున, క్రీడించు యోగీంద్రుమర్యాదన్ = విహరించెడి ఋషీంద్రునివలె, కరిపాద + ఆక్రాంతినిర్వక్రమై = ఏనుఁగు యొక్క పాదములను బట్టుకొనుటయందు నడ్డులేనిదై, విక్రమించెన్ = రేఁగెను.

తా. మొసలి తనరెండుపాదములను నేలయం దూని, బిగియఁబట్టి, పంచేంద్రియగర్వంబు నణఁచికొని, బుద్ధిస్థైర్యముగలదై యేనుఁగుయొక్క పాదములనడ్డులేకుండఁ బట్టికొనుచు, దుఃఖములేని బ్రహ్మపదము నొందఁ గోరి సమాధియందున్న యోగీంద్రునివలె వెలయుచుండెను. (సమాధి యందున్న యోగియుఁ దనరెండుపాదంబులను నేలమీఁదనూని యుచ్ఛ్వాస నిశ్వాసములులేక, యింద్రియవిషయములను వర్జించి, నిశ్చలబుద్ధిఁగలవాఁడై యుండును అనిభావము.)

ఆ. *వనగజంబుఁ దిగుచు ♦ వనచారిఁ బొడఁగని
వనగజంబ కాన ♦ వజ్రిగజము
వెల్ల నై సురేంద్రు ♦ వేసి సుధాంధులు
పట్టఁ బట్టనీక ♦ బయలు ప్రాఁకె. 50

టీ. వనగజంబున్=వనంబునఁ (అడవియందుఁ) బుట్టినగజమును, తిగుచు = ఈడ్చుచున్న, వనచారిన్ = వనంబునందుఁ (నీటియందు) దిరుగుచుండు మొసలిని, పొడఁగని = చూచి, వజ్రిగజము = దేవేంద్రుని యేనుఁగు, (ఐరావతము) వనగజంబు + అ + కానన్ = వనంబునందుఁ (నీటియందు) బుట్టిన యేనుఁగే యగుటచేత, వెల్లనై = దుఃఖపడినదై, సురేంద్రున్ = ఇంద్రుని, వేసి = క్రిందఁద్రోచి, సుధాంధులు = (అమృతమే యన్నముగఁ గలవారగు) వేల్పులు, పట్టన్=పట్టుకొనరాఁగా, పట్టనీక = చిక్కక, బయలుప్రాఁకెన్ = ఆకసంబువైపునకుఁ బరుగెత్తెను.

తా. ఇట్లు మొసలిచేఁ బీడింపఁబడుచుండు వనగజంబును జూచి ఇంద్రునిగజంబు సైతము వనగజం బగుటచేత "మనజాతియందుఁ బుట్టిన దాని కింతశ్రమ వచ్చెఁగదా" యని యింద్రుని డించి తెల్లపాటి, దేవతలకుఁ జిక్కక యాకసంబువైపునఁ బరువిడెను.

ఉ. ఊహ కలంగి జీవనపు ♦ టోలమునం బడి పోరుచు న్మహా
మోహలతానిబద్ధపద ♦ మున్విడిపించుకొనంగ లేక సం
దేహముఁ బొందు దేహిక్రియ ♦ దీనదశన్ గజముండె
భీషణ గ్రాహదురంతదంతపరి ♦ ఘట్టితపాదఖురాగ్రశల్యమై.

---

*వనము = అనఁగా నడవి, నీరు, ఐరావతముపక్షమున 'వనము=నీరు' అని యర్థము. ఐరావతము సముద్రమథనమపుడు పాల్కడలియందుఁ బుట్టినది. యని పురాణకథ. ప్రకృతమున అడవియందలియేనుఁగని యర్థము. అంటికిని నభేదాధ్యవసాయము.

టీ. గజము, భీషణ....శల్యము+ఐ - భీషణ=వెఱపించు, గ్రాహ=మొసలియొక్క, దురంత = చెడ్డమొనలుగల, దంత = కోఱలచేత, పరిఘట్టిత = చక్కఁగాఁ గ్రుచ్చి పట్టుకొనఁబడిన, పాద = కాలియందలి ఖురాగ్రశల్యము + ఐ = గిట్టలకొనలయెముకఁగలదై, ఊహ = బుద్ధి, కలంగి = చెదరి, జీవనపు + ఓలమునన్ = నీళ్ళనుప్రదేశమందు, (యోగిపక్షమున సంసారమను ప్రవాహమునందు) పడి, పోరుచున్ = జగడమాడుచు, మహా .... పదమున్ - మహత్ = గొప్ప, మోహ = అజ్ఞానమనెడి, లరా = తీఁగచే, నిబద్ధ = చక్కఁగాఁ గట్టబడిన, పదమున్ = పాదమును, విడిపించుకొనంగన్ లేక = విడిపించుకొనఁజాలక, సందేహమున్ + పొందుదేహిక్రియన్ = జీవనసంశయముఁ గలిగియుండు ప్రాణివలె, దీనదశన్ = దుఃఖావస్థతో, ఉండెను.

తా. ఒకప్రాణి యధికమైన యవివేకమునంబడి, బుద్ధి నిలుకడలేక సంసారవిషయమునఁ జింతపడునట్లు, గజేంద్రుఁడును మొసలిపట్టుకొన్న తనకాలిని విడుపించుకొనఁజాలక మిక్కిలి దిగులుపడి యుండెను.

వ. ఇవ్విధంబున, 52

తా. ఇట్లు గజేంద్రుఁడు మకరిచేతఁ జిక్కి కలఁతపడియుండఁగా,

క. అలయక సొలయక వేసట
నొలయక కరి మకరితోడ ననుదండత రా
త్రులు సంధ్యలు దివసంబులు
సలిపెం బో రొక్కవేయి సంవత్సరముల్. 53

టీ. కరి = ఏనుఁగు, అలయక = బడలిక నొందక, సొలయక = మూర్ఛనొందక, వేసటన్ = విసుగును, ఒలయక = పొందక, రాత్రులు సంధ్యలు దివసంబులు=రేయింబవళ్లను సంధ్యాకాలములందును, ఒక్క

వేయిసంవత్సరములు = వేయియేండ్లు, మకరితోడన్ = మొసలితో, ఉద్దండలీలన్ = గర్వముతో, పోరు = యుద్ధము, సలిపెను = చేసెను.

తా. ఈ ప్రకారముగా నాగజేంద్రుఁడు దయ్యక, పాయమారక పడక, విసువక వేయిసంవత్సరములకాలము రేయింబవళ్లు సంధ్యలు నడక, యెడతెగక మొసలితోఁ బోరుసేయుచుండెను.

మ. పృథుశక్తిం గజమాజలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరా
డి సం, శిథిలంబై తనలావు వైరిబలముం జింతించి
మిథ్యామనోరథ మింకేటికి దీనిగెల్వ సరిపోరం జాలరా
దంచు న, వ్యథమైయిట్లనుఁ బూర్వపుణ్యఫలదివ్యజ్ఞాన
సంపత్తితోన్. 54

టీ. గజము, పృథుశక్తిన్ = ఎక్కువబలిమితో, ఆజలగ్రహముతో = ఆమొసలితో, పెక్కేండ్లు = అనేకసంవత్సరములు, పోరాడి, సంశిథిలంబు + ఐ = మిక్కిలి యలసినదై, తనలావున్ = తనబలిమిని, వైరిబలమున్ = శత్రువుయొక్కబలిమిని, చింతించి, దీనిన్ + గెల్వన్, మిథ్యామనోరథము = (నేను దీనిని జయింతును అనెడు) వట్టికోరిక, ఇంకేటికిన్ = ఇంకనెందుకు ? సరి = దీనితోసాటిగా, పోరన్ = యుద్ధమునందు, చాలరాదు = శక్తిలేదు, అంచున్, అవ్యథమై=చింతఁ బాసినదై, పూర్వ... సంపత్తితోన్ - పూర్వ= ముందటిజన్మమందలి, పుణ్య = పుణ్యములయొక్క, ఫల = ఫలమైన, దివ్యజ్ఞానసంపత్తితోన్ = శ్రేష్ఠమగుజ్ఞానసంపదతోఁగూడి, ఇట్లు+అనున్= ఇట్లు చెప్పుచున్నది.

తా. గజరాజు మొసలితోఁ బెక్కుసంవత్సరములు పోరి, మిక్కిలి యలసి, యిఁక దీనితో సాటిగా నేఁ బోరాడ లే నని తలంచి, తనపూర్వ జన్మపుణ్యము పరిపక్వమగుటచే దివ్యజ్ఞానమునొంది, చింతను విడిచి, యీ క్రిందితెఱఁగున భావింపఁదొడఁగెను.

శా. ఏ రూపంబున దీనిగెల్తు నిటమీఁదేదేవేల్పుఁ జింతింతు నె
వ్వారిం జీరుదు నెవ్వ రడ్డమిఁక నీవ్వారి ప్రచారోత్తము
న్వారింపందగువార లెవ్వ రఖిలవ్యాపార పారాయణుల్
లేరే మ్రొక్కెద దిక్కుమాలినమొరాలింపం బ్రపుణ్యాత్మకుల్.

టీ. ఏరూపంబునన్ = ఏవిధముగా, దీనిన్ = ఈమొసలిని, గెల్తును? ఇటుమీఁదన్ = ఇఁకమీఁద, ఏవేల్పును = ఏదేవతను, చింతింతును = ధ్యానింతును. ఎవ్వారిన్ + చీరుదును=ఎవరిని(బిల్తును ? ఎవ్వరు+అడ్డము+ ఇఁక = ఇఁకను నా కడ్డపడువారెవ్వరు ? ఇవ్వారిప్రచార+ఉత్తమున్ = జలజంతువులలో శ్రేష్ఠమయిన యీమొసలిని, వారింపన్+తగువారు = ఆటంకపెట్టఁజాలినవారు, ఎవ్వరు ? దిక్కుమాలినమొఱ = దిక్కులేని నామొక్కదేపురింపును, ఆలింపన్ = వినుటకు. అఖిలవ్యాపారపారాయణుల్ = అంపటి పనులందును తన పనులందువలె నెక్కువ శ్రద్ధఁగల వారును ప్రపుణ్య+ఆత్మకుల్= మిక్కిలి పరిశుద్ధమైన మనసుఁగలవారును, లేరే = లేరా! మ్రొక్కెదన్ = (అట్టివా రుందురేని వారికి) నమస్కరింతును.

తా. నే నెట్లు దీని జయింతును ? ఏదైవమును ధ్యానింతును ? ఎవరినీ నాఁకుఁ దోడుగాఁ బిలుతును ? దీని నడ్డగింపఁజాలినవా రెవ్వరున్నారు ? దిక్కులేని నాయొక్క దీనధ్వనిని విని నన్నుఁ గాపాడునట్టి పరోపకార పరులగు పుణ్యాత్ములకు నేమ్రొక్కెదను. నన్ను వారు రక్షింతురుగాక.

శా. నానానేకపయూథము ల్వనములోనం బెద్దకాలంబు స
న్మానింపన్దశలక్షకోటికరిణీనాథుండనై యుండి మ
ద్దానాంభఃపరిపుష్టచందనలతాంతచ్ఛాయలం దుండ లే
కీనీరాశ కిటేల వచ్చితి భయంబెట్లోకదే యీశ్వరా. 56

టీ. ఈశ్వరా = ఓ దై వ మా! నానా .... యూథపముల్-నానా = పెక్కులైన, అనేకప = ఏనుఁగులయొక్క, యూథపముల్ = గుంపులు, వనములోనన్ = అ డ వి య ం దు, పెద్దకాలంబు = చాలదినములు. సన్మానింపన్ = గారవించుచుండఁగా, దశలక్షకోటి కరిణీనాథుండనై = పదిలక్షలకోట్ల యాఁడేనుఁగులకుఁ బ్రియుఁడనై (పదిలక్షలకోట్లు = అనేకములని యర్థము,) ఉండి, మత్ .... ఛాయలందున్ - మత్ = నాయొక్క. దాన+అంభః=మదజలముచేత, పరిపుష్ట=చక్కఁగాఁ దెంచఁబడిన, చందన= శ్రీగంధపుఁ జెట్లయొక్కయు, లతా = తీఁగెలయొక్కయు, అంతచ్ఛాయలందున్ = మధ్యమందలి నీడలందు, ఉండన్ + లేక = ఉండఁజాలక, ఈనీరాస=ఈ పాడుజలమందలి యాశచే, ఇటు + ఏలవచ్చితిని=ఇక్కడి కెందుకు వచ్చితిని? భయంబు=ఈ యాపద, ఎట్లు+ఓ+కదా = ఎట్లగును సుమా ?

తా. ఓదైవమా ! నే నీయరణ్యమున ననేకములైనయేనుఁగుగున్నలు గౌరవించుచు నాతోడ వచ్చుచుండఁగాఁ, బెక్కుపెంటియేనుఁగులతోఁగూడి నామదజలముచేఁ దడుపఁబడి పెరుఁగుచున్నచందనపు బ్రానులయుఁ, దీవ రిండ్లయు లోపలినీడలలోఁ దిరుగుచుంటిని. అట్లుండినదాన నుండక యీ పాడుదప్పి యేల నాకుఁగలిగెను ? ఏల నే నీ కొలనికివచ్చి యింతయాపదఁ దెచ్చుకొంటిని? గ్రహచార మెవ్వని విడఁచును? హా! దైవమా ! నాయాపద యెట్లు తొలఁగునో తెలియరాకున్నది.

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై,
యెవ్వనియందుడిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూల
కారణం, బెవ్వఁడనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము
దానయైనవాఁ, డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరునే
శరణంబు వేఁడెదన్. 57

టీ. జగము = ప్రపంచము, ఎవ్వనిచేన్ = ఎవ్వనిమూలమున, జనించున్ = పుట్టునో, ఎవ్వనిలోపలన్ = ఎవనికుక్షియందు, ఉండున్, లీనమై=నశించి, ఎవ్వని యందున్, డిందున్=అడఁగియుండునో, పరమేశ్వరుఁడు = చర+అచర రూపమగు ప్రపంచమునకు అంతకును ప్రభువు, ఎవ్వఁడు ? మూలకారణంబు = ప్రధానకారణమయినవాఁడు ఎవ్వఁడు? అనాదిమధ్యలయుఁడు = సృష్టిస్థితిలయములు (పుట్టుక, ఉనికి, గిట్టుట) అనునవి లేనివాఁడు, ఎవఁడు? సర్వమున్=అంతయు, తాన+ఐనవాఁడు= తానయైయుండువాఁడు, ఎవ్వఁడు? వానిన్=అట్టి, ఆత్మభవున్=తనంతటఁ దానే పుట్టినవాఁడగు, ఈశ్వరున్=దేవదేవుని, శరణంబు వేఁడెదన్=శరణుఁ జొచ్చెదను.

తా. ఏభగవంతునిచే జగంబులుపుట్టిపెరిఁగి నశించుచున్నవో, ఎవ్వఁడన్నివస్తువులకును ప్రభువో, ఎవ్వఁ డన్నివస్తువులకుఁ ప్రధానకారణభూతుఁడో, ఎవ్వనికి మొదలు నడుమ కొన యనునవి లేవో, ఎవఁడు సర్వాత్మస్వరూపుఁడో, యట్టి భగవంతుని నన్నుఁ గాపాడ వేఁడుచున్నాఁడను.

క. ఒకపరి జగముల వెలి నిడి
యొకపరి లోపలికిఁ గొనుచు ♦ నుభయముఁ గనుచున్
సకలార్థసాక్షి యగు న
య్యకలంకుని నాత్మమయుని ♦ నర్థింతు మదిన్. 58

టీ. ఒకపరి = ఒకతడవ, జగములన్ = పదునాలుగులోకములను, వెలిన్ + ఇడి=వెలుపటనుంచి, ఒకపరి=ఒకతడవ, లోపలికిన్=తనలోపలికి, కొనుచున్=తీసికొనుచు, ఉభయమును = రెంటిని (లోకముయొక్క-సృష్టిని, సంహారమును), కనుచున్ = చూచుచు, సకల+అర్థసాక్షి = అన్నివిషయ

ములను జూచుచుండునట్టి, అగున్ + అయ్యకలంకునిన్ = కళంక రహితుఁడైనట్టి, ఆత్మమయునిన్ = జ్ఞానస్వరూపుఁడైన భగవంతుని, మదిన్=మనస్సునందు, తలంతున్=ధ్యానించెదను.

తా. సకలలోకముల నొకపర్యాయము వెలుపలికి విడిచి, తనయిష్టము వచ్చినప్పు డాలోకములనన్నింటిని దనలోపల నణఁచుకొని, సృష్టిస్థితి సంహారములను రెంటినిఁ జూచుచు నన్నివిషయములకు సాక్షియగు కళంక రహితుఁడైన జ్ఞానరూపుఁడగు నా సర్వేశ్వరుని నేను మనంబున ధ్యానించు చున్నాను.

క. లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినఁ దుది నలోకం బగు పెం
జీఁకటి నెవ్వఁడు వెలిఁగెడు
నేకాకృతితోడ నతని నే సేవింతున్. 59

టీ. లోకంబులు=పదునాలుగుజగములు, లోక+ఈశులు=ఇంద్రుఁడు మున్నగుదిక్పాలురు, లోకస్థులన్=లోకమునందుండు చరాచరవస్తువులును, తెగినన్=చనినను, తుదిన్ = ప్రలయకాలమునందు, అలోకంబు + అగు + పెన్ + చీఁకటిన్ = లోకములులేని కటికచీఁకటియందు, ఎవ్వఁడు = ఏభగవంతుఁడు, ఏకాకృతితోడన్ = ఒకటేయాకారముతో, వెలింగెడున్ = ప్రకాశించుచున్నాఁడో, అతనిన్ = ఆపరమాత్మ స్వరూపుని, నేను, సేవింతున్ = ధ్యానించెద.

తా. లోకములును, లోకపాలురును, లోకవాసులును నశించిన పిదప నీలోకములన్నియు నశించి గాఢాంధకారముచే వ్యాప్తమై యుండునట్టి యంధకారమున నేకాకారముతో వెలుఁగుచున్న యాభగవంతుని నేను ధ్యానించుచున్నాను.

క. నర్తకునిభంగిఁ బెక్కగు
మూర్తులలో నెవ్వఁ డాడు ॥ మునులును దివిజుల్
గీర్తింప నేర రెవ్వని
వర్తన మెఱుఁగ రట్టి ॥ వాని నుతింతున్. 60

టీ. నర్తకునిభంగిన్ = వేసగానివలె, పెక్కగుమూర్తులలోన్ = అనేకములయిన రూపములలో, ఎవ్వఁడు, ఆడున్ = తిరుగుచుండునో, మునులును = ఋషులును, దివిజుల్=దేవతలును, ఎవ్వనివర్తనము=ఎవ్వని నడతను, కీర్తింపనేరరు = చెప్పనేరరో? ఒరులు = ఇతరులు, ఎవ్వని వర్తనము, ఎఱుఁగరు = తెలియరో, అట్టివానిని, నుతింతున్ = కొనియాడెదను.

తా. వేసగాఁడు నాటకశాలయందుఁ బలువేసములు దాల్చునట్లు ఎవఁడు సకలభూతములలోపలనుండి నటించుచుండునో, ఎవని మహిమ మునీంద్రులకును వేల్పులకును గోచరముగాదో, ఎవరి కాతనిచరిత్రమిట్టిదని తెలియదో యాభగవంతుని నేఁ దలఁచుచున్నాను.

ఆ. ముక్తసంగు లైన ॥ మునులు దిదృక్షులు
సర్వభూతహితులు ॥ సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యు ॥ లై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు ॥ దిక్కు నాకు. 61

టీ. ముక్తసంగులున్ = సంసారనాశమునుండి విడువఁబడినవారు, ఐన మునులున్ =ఐనఋషులును, దిదృక్షులు=భగవంతుని సాక్షాత్కరింపఁ గోరినవారును, సర్వభూతహితులు = అన్నిజంతువుల మేలుఁగోరువారును, సాధుచిత్తులు=మంచిమనస్సుఁగలవారును, అసదృశవ్రత+ఆఢ్యులై = సాటిలేని నియమములతోఁ గూడినవారలై, ఎవ్వని దివ్యపదము = ఏభగవంతుని.

యొక్క శ్రేష్ఠములైనపాదములను, కొల్తురు=ఆశ్రయింతురో, వాఁడు = ఆ భగవంతుఁడు, నాకున్, దిక్కు = గతి.

తా. సంసారసుఖంబులు వర్జించినమునులు, బ్రహ్మసాక్షాత్కారముఁ గోరువారయి, సకలభూతములకు హితముసేయువారును, సత్పురుషులునై తామెంత నియమవంతులుగా నున్నను, నే భగవంతుని నెఱుంగఁజాలరో, ఆతని నేను స్తోత్రముఁ జేసెదను. అతఁడు నాకు రక్షకుఁ డగుఁగాక.

సీ. భవము దోషంబు రూపంబు కర్మంబు నా
హ్వయమును గుణము లెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించుకొఱకు నై
నిజమాయ నెవ్వఁ డిన్నియును వాల్చు
నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ
కిద్ధరూపికి రూపహీనునకును
జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికిని
బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు

ఆ. మాటల నెఱుకలను మనములఁ జేరంగ
రానిశుచికి సత్త్వరమ్యు లగుచు
నిపుణు లైనవారి నిష్కర్మతకు మెచ్చు
వాని కే నొనర్తు వందనములు. 62

టీ. ఎవనికిన్ = ఏ విష్ణుమూర్తికి, భవము=పుట్టుకయు, దోషంబు = పాపంబును, రూపంబు=రూపును, కర్మంబు = పనియు, ఆహ్వయమును = పేరును, గుణములు = సత్త్వరజస్తమోగుణములు, ఎవ్వనికిన్ = ఏ భగవంతునికి, లేక = లేకున్నను, జగంబులన్ = లోకములను, కలిగించు

సమయించుకొంటకున్ + ఐ = పుట్టించుకొంటకును సంహరించుటకును, అన్నియున్=పైఁజెప్పిననామరూప గుణజననమరణాదులు, నిజమాయన్ = తన మాయాగుణముచేత, ఎవ్వాఁడు, తాల్చును = ధరించునో, అపరేశునకున్ = అన్నిటికంటె మేలయినవానికి, అనంతశక్తికిన్=తుదిలేని బలిమిఁగలవానికి, బ్రహ్మకున్ = విధాతకు. (సృష్టికర్తయగువానికి) ఇద్ధ రూపికిన్ = జ్వలించుచున్న స్వరూపముఁగలవానికి, రూపహీనునకున్ = రూపంబులేనివానికి, చిత్రచారునకున్ = వింతయైనచరిత్రములు (నడతలు) గలవానికి, సాక్షికిన్ = అన్నికార్యములఁ జూచువానికి, ఆత్మరుచికిన్ = తనంతట దానేవెలుఁగువానికి, (స్వయంప్రకాశస్వరూపమునకు), పరమాత్మ నకును = ఆత్మకుఁగూడ నాత్మయైనవానికి, పరబ్రహ్మమునకున్ = మాయనుమీఱిన బ్రహ్మమైనవానికి, మాటలన్=మాటలచేతను, ఎఱుకలన్= జ్ఞానములచేతను, మనములన్ =మనస్సులచేతను, చేరంగన్=పొందుటకు, రాని=అలవికాని, శుచికిన్ = పవిత్రమూర్తికి, సత్త్వరమ్యుఁడు = సత్త్వ గుణముఁగలవారిచేఁబొందఁదగినవాఁడగుచు, నిపుణులు+ఐనవారినిష్కర్మత కున్=నేర్పరులగువారియొక్క స్వకర్మపరిత్యాగమునకును,మెచ్చువానికిన్= కొనియాడువానికి, ఏను, వందనములు+ఒనర్తున్=నమస్కరించెదను.

తా. ఎవనికి స్వయముగా జన్మము, పాపము, నామరూపములు గుణ క్రియలు లేక యున్నను, సృష్టిస్థితిలయంబులనిమిత్తమై నామరూపగుణ క్రియాదులను గలిగి మాయను దనచేత నుంచుకొన్నవాఁడును, మితిమీఱిన బలిమిఁగలవాఁడును, పరాత్పరుఁడును, తేజోరూపుఁడును, రూపరహితుం డును, వింతలగు గొప్పచరిత్రములుగలవాఁడును, అవాఙ్మానసగోచరుఁడును, సాత్త్వికగుణము కలిగి సంసారముఁ బాసియున్నవారికిమాత్రమె ప్రత్యక్ష మగు నాభగవంతునికి నేను మ్రొక్కెదను.

సీ. శాంతున కపవర్గ సౌఖ్యసంవేదికి
నిర్వాణభర్తకు నిర్విశేషు

నకు ఘోరునకు గూఢునకు గుణధర్మిక
సౌమ్యున కధికవిజ్ఞానమయున
కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహు
క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రి
యజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి

ఆ. నెఱి నసత్య మనెడి నీడతో వెలుఁగుచు
నుండు నెక్కటికి మహోత్తరునకు
నిఖిలకారణునకు నిష్కారణునకు న
మస్కరింతు నన్ను మనుచుకొఱకు. 13

టీ. శాంతునకున్ = ఓర్పుఁగలవానికి, అపవర్గసౌఖ్యసంవేదికిన్ = మోక్షానందమును జక్కఁగానెఱిఁగినవానికి, నిర్వాణభర్తకున్ = మోక్షపదమున కధికారియైనవానికి, నిర్విశేషునకున్ = తనకంటె వేఱొక్కటియైన వస్తువులేనివానికి, ఘోరునకున్ = శత్రువులకు భీతి నొసఁగువానికి, గూఢునకున్=ఏకాంతముగనుండువానికి, గుణధర్మికిన్ = సత్త్వరజస్తమంబులనెడి గుణములుగలవానికి,సౌమ్యునకున్=ప్రియునికి, అధికవిజ్ఞానమయునకున్ = ఎక్కువజ్ఞానమే స్వరూపముగాఁగలవానికి, అఖిల + ఇంద్రియద్రష్టకున్ = అందఱి మనస్సులను గనిపెట్టువానికి, అధ్యక్షునకున్ = చూపులకు మీఱినవానికి, బహుక్షేత్రజ్ఞునికిన్ = సర్వవ్యాపియైయుండువానికి, దయాసింధుమతికిన్=దయకు సముద్రమయిన మతిఁగలవానికి, మూలప్రకృతికిన్= ప్రధానకారణమయినవానికి, ఆత్మమూలునకున్ = జీవులకాధారభూతునికి, అఖిల + ఇంద్రియజ్ఞాపకునకున్=అందఱియింద్రియములనునడపించువానికి, దుఃఖ+అంత కృతికిన్=దుఃఖమునకు ముగింపుగలిగి నడచువానికి,నెఱిన్=

ప్రియముగా, అసత్యము అనెడినీడతోన్ = సర్వము వట్టిదియను చాయ క్రింద, వెలుఁగుచుండు ఎక్కటికిన్ = ప్రకాశించు ఒక్కనికి. మహత్ + తమునకున్ = మిక్కిలి గొప్పవానికి, నిఖిల కారణునకు = అన్నిటికిని కారణమైనవానికి, నిష్కారణునకున్ = తన యుత్పత్తిహేతువులేనివానికి (భగవంతునికి), నన్నున్, మనుచుకొఱకున్ = కాపాడునిమిత్తము, నమస్కరింతును.

తా. శాంతుఁడును, మోక్షానందమును జక్కఁగా నెఱిఁగినవాఁడును, మోక్షాధికారియు, సర్వాతీతుఁడు, అజ్ఞానులకు భీతిప్రదుఁడు, తెలియ నలవి కానివాఁడు, త్రిగుణాత్ముఁడు, సౌమ్యుఁడు, జ్ఞానరూపుఁడు, సర్వలోకముల యింద్రియవ్యాపారములకుసాక్షి, అధిపుఁడు, సర్వశరీరాంతర్యామి, దయాళువు, మూలకారణుఁడు, జీవరాసులకుఁ బ్రభువు, అంతటి యింద్రియకార్యములను నడపించువాఁడు, సర్వదుఃఖవినాశకుఁడు, మాయాతీతుఁడయినను మాయకు లోఁబడియుండునట్లు నటించువాఁడు, జగత్తునకంతకుఁ గారణభూతుఁడు, స్వయముగాఁ గారణరహితుఁడు, ఉత్తమోత్తముఁడు నైన యాభగవంతుని నన్నుఁ గాపాడఁగోరి మ్రొక్కుచున్నాను

క. యోగాగ్ని దగ్ధకర్ములు
యోగీశ్వరు లేమహాత్ము నొండెఱుఁగక స
ద్యోగవిభాసితమనముల
బాగుగ నీక్షింతు రట్టి పరము భజింతున్. 64

టీ. యోగాగ్నిదగ్ధకర్ములు-యోగ = తపస్సమాధియనెడు, అగ్ని = అగ్నిహోత్రునిచేత, దగ్ధ = కాల్పఁబడిన, కర్ములు=పాపకర్మముగలవారు, (అగు) యోగీశ్వరులు=యోగులలోఁ బ్రభువులు, ఒండు+ఎఱుఁగక=మఱియొక్కటిఁదెలియక, సద్యోగవిభాసితమనములన్-సత్ = మంచి, యోగ = ధ్యానముచే, విభాసిత=వెలుఁగుచుండు, మనములన్=మనసులందు, ఏమహా

త్మన్=ఏభగవంతుని, బాగుగన్=లెస్సగా, ఈక్షింతురు = చూతురో, అట్టి పరమున్=అట్టిపరమాత్మని, భజింపన్ = సేవింతును.

తా. ప్రపంచమంతయు మాయాసంబంధములయిన కార్యముల నన్నింటిని విడిచి, యోగనిష్ఠగలిగియుండు యోగీశ్వరులు నట్టి తపముంచియోగము లచే వెలయుచుండు తమమనస్సులందుఁ దక్కినసంగతుల నన్నింటినిఁబాసి, యా భగవంతునిమాత్రమే చూచుచుందురో, అట్టి పరమాత్మను నేను ధ్యానించుచున్నాను.

సీ. సర్వాగమామ్నాయ జలధికి నపవర్గ
మయునికి నుత్తము మందిరునకు
సకలగుణారణి చ్ఛన్నబోధాగ్నికిఁ
దనయంత రాజిల్లు ఘనమతికి
గుణలయోద్దీపిత గురుమానసునకు సం
వర్తితకర్మ నిర్వర్తితునకు
దిశలేనినాబోఁటి పశువులపాపంబు
లణఁచువానికి సమస్తాంతరాత్మఁ

ఆ. దై వెలుంగువాని కచ్ఛిన్ను నకు భగ
వంతునకుఁ దనూజ పశునివేశ
దారసక్తు లయినవారి కందఁగరాని
వాని కాచరింతు వందనములు. 65

టీ. సర్వ...జలధికిన్-సర్వ = అన్ని, ఆగమ=(దేవతాపూజావిధానములందెల్పు)పాంచరాత్రశైవాగమములకును, ఆమ్నాయ=వేదములకును

జలధికిన్=సముద్రుఁడైనవానికి, అపవర్గమయునికిన్=మోక్షమేరూపముగాఁ గలవానికి, ఉత్తమమందిరునకున్=శ్రేష్ఠుల కునికిపట్టయినవానికి, సకల.... గ్నికిన్- సకలగుణ=అన్నిసద్గుణంబులనెడి, అరణి=నిప్పుచిలికెడు కొయ్యలచే, ఛన్న=కప్పఁబడిన, బోధ=జ్ఞానమనెడు, అగ్నికిన్=అగ్నిఁగలవానికి, తనయంత=తనకుఁదానే,రాజిల్లు=వెలిఁగెడు, ధన్యమతికిన్=పవిత్రమైనబుద్ధిఁ గలవానికి, గుణ....సునకున్-గుణ=సత్త్వము మున్నగుత్రిగుణములయొక్క, లయ=నాశముచేత, ఉద్దీపిత=వెలిఁగింపఁబడిన, గురు=గొప్ప, మానసునకున్ = మనసుగలవానికి, సంవర్తిత....నిర్వర్తితునకున్ = సంవర్తిత = ముగింపఁబడిన, కర్మ = అనుష్ఠానములుగలవారిచేత, నిర్వర్తితునకున్ = పొందఁబడినవానికి, దిశలేని = దిక్కులేని, నాబోటిపశువుల పాపంబులు= నాపంటియజ్ఞానుల పాపములను, అణఁచువానికిన్ = పోగొట్టువానికి, సమస్త+అంతరాత్ముఁడై=అన్నిఁటిలోపల నున్నవాఁడై, వెలుఁగువానికి = ప్రకాశించువానికి, అచ్ఛిన్ననకున్ = నాశరహితునికి, తనూజ....అయిన వారికిన్—తనూజ = కొడుకులు, పశు = గొడ్డుగోవలు, నివేశ = ఇండ్లు, దార = భార్యలు అనువానియందు, సక్తులు + అయినవారికిన్ = తగులుగల వారిచేత (తృతీయార్థమందుషష్ఠి), అందఁగరానివానికిన్ = పొందనలవికాని వానికి, వందనములు+ఆచరింతును = నమస్కరింతును.

తా. సకలవేదాగమంబులకునిధియయినవాఁడును, మోక్షరూపుఁడును, సజ్జనసేవ్యుఁడును, సత్త్వాదిగుణములచే నావరింపఁబడినవాఁడయ్యును, లోపల జ్ఞానదీపంబుచే వెలుఁగువాఁడును, స్వయంప్రకాశస్వరూపుఁడును, సత్త్వాదిగుణరహితుఁడగుటచే జ్వలించు మనస్సుగలవాఁడును, సకల కర్మానుష్ఠానపరులచేఁ బొందఁబడువాఁడును, దిక్కులేని నాబోటివారిమొఱ లాలించి, వానింబోకార్చువాఁడును, సర్వాంతర్యామియై వెలుఁగువాఁడును, సంసారసముద్రమున మునిఁగినవారి కసాధ్యుఁడును నైన యాభగవంతుని నమస్కరించుచున్నాను.

వ. మఱియును, 66

సీ. వరధర్మకామార్థ ◦ వర్జితకాము లై
విబుధు లెవ్వాని సేవింతు రిష్ట
గతిఁ బొందుదురు చేరి ◦ కాంక్షించువారి క
వ్యయదేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ
ముక్తాత్ము లెవ్వని ◦ మునుకొని చింతింతు
రానందవార్ధి మగ్నాంతరంగు
లేకాంతు లెవ్వని ◦ నేమియుఁ గోరక
భద్రచరిత్రంబుఁ ◦ బాడుచుందు

ఆ. రామహేశు నాద్యు ◦ నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు ◦ నున్నతాత్ము
బ్రహ్మ మైనవానిఁ ◦ బరుని నతీంద్రియు
నీశు స్థూలు సూక్ష్ము ◦ నే భజింతు. 67

టీ. వర....కాములై-వర=శ్రేష్ఠములయిన, ధర్మ+కామ+అర్థ=ధర్మ, అర్థ కామములను మూఁడుపురుషార్థములందును, వర్జిత = విడుపఁబడిన, కాములై = కోరికఁగలవారై, విబుధులు = జ్ఞానులు, ఎవ్వానిన్ = ఏభగవంతుని, సేవింతురు = కొల్చుచుందురో, ఇష్టగతిన్ = కోరినతావును, పొందుదురో, చేరి = దగ్గఱకేతెంచి, కాంక్షించువారికిన్ = కోరువారికి, ఎవ్వాఁడు, అవ్యయదేహము = శాశ్వతమగు దివ్యశరీరమును, కరుణన్ = దయతో, ఇచ్చునో, ముక్తాత్ములు = దేహాభిమానమును వదలినవారు, ఎవ్వనిన్ = ఏభగవంతుని, మునుకొని=పూని, చింతింతురు=ధ్యానింతురో,

ఆనంద....రంగులు-ఆనంద=సంతోషమనెడి, వార్ధి=కడలియందు, మగ్న=మునిఁగిన, అంతరంగులు = మనస్సుగలవారయిన, ఏకాంతులు = విడువని భక్తిగలవారగుమునులు, ఎవ్వనిన్ = ఏభగవంతుని, ఏమియున్+కోరక = ఫలమునందు నిరపేక్షతో, భద్రచరిత్రంబున్ = పుణ్యమయిన చరిత్రమును, పాడుచుందురు = కొనియాడుదురో, ఆ మహేశున్ = అగొప్పప్రభువును, ఆద్యున్ = అందఱికంటె మొదటివానిని, అవ్యక్తున్ = తెలియుటకలవికాని వానిని, అధ్యాత్మయోగగమ్యున్ = మనంబున ధ్యానంబుచేఁ బొందఁదగిన వానిని, పూర్ణున్ = సర్వత్రనిండినవానిని, ఉన్నతాత్మున్ = గొప్పమహిమ గలవానిని, బ్రహ్మము + అయినవానిని = వేదతపోమయుని, పరున్ = ఉత్తముని, అతి + ఇంద్రియున్ = ఇంద్రియవిషయముల నతిక్రమించిన వానిని (ఇంద్రియములకుఁ గనఁబడనివానిని), స్థూలున్ = పృథివ్యాదిస్థూల రూపంబులుగలవానిని, సూక్ష్మున్ = పరమాణురూపంబుఁ దాల్చినవానిని, ఈశున్ = సర్వేశ్వరుని, నేన్, భజింతును = కొలుతును.

తా. ధర్మార్థకామములం దాశఁ బరిత్యజించినజ్ఞాను లెవ్వనిఁ గొల్చుచుండి, తమయిష్టమైనమోక్షము నొందుదురో, అట్లు తన్నుభజించువారి కే భగవంతుఁడు నాశరహితమగుమోక్షము నొసఁగునో, ఏముముక్షువులు పూనికతో భగవంతుని ధ్యానించి, తమయిష్టంబు వడసి, యానందమునఁదేలాడుదురో, అట్టిమహేశ్వరుఁడును, వాఙ్మానసములకు గోచరుఁడు గానివాఁడును, బ్రహ్మస్వరూపుఁడును,స్థూలసూక్ష్మరూపంబుఁగలవాఁడును, ఇంద్రియములకు గోచరుఁడు గానివాఁడును, పరాత్పరుఁడు నైన భగవంతుని నేను గొల్చుచున్నాను,

వ. అని మఱియు నిట్లనియె,

తా. గజేంద్రుఁడు భగవంతుని నివ్విధంబున ధ్యానంబుసేసి మఱలఁ దనమనంబున నిట్లు భగవంతునిఁ దలపోసెను.

సీ. పావకుం డర్చుల భానుండు దీప్తుల
నెబ్భంగి నిగిడింతు రెట్లడంతు
రాక్రియ నాత్మ కరావళిచేత బ్ర
హ్మాదుల వేల్పుల నఖిలజంతు
గణముల జగముల ఘననామరూపభే
దములతో మెఱయించి తగ నడంచు
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియంబులు దాన
యై గుణసంప్రవాహంబు నెఱపు

తే. స్త్రీనపుంసకపురుషమూర్తియును గాక
తిర్యగమరనరాదిమూర్తియును గాక
కర్మగుణభేదసదసత్ప్రకాశి గాక
వెనుక నన్నియుఁ దా నగు విభునిఁ దలఁతు. 69

టీ. పావకుండు = అగ్ని, అర్చులన్ = మంటలను, భానుఁడు = సూర్యుఁడు, దీప్తులన్ = కిరణములను, ఎబ్భంగిన్ = ఏరీతున, నిగిడింతురు = పర్వఁజేయుదురో, ఎటు=ఏతీరున, అడంతురు = తగ్గింతురో, ఆక్రియన్ = ఆ విధమున, ఎవ్వఁడు = ఏ భగవంతుడు, ఆత్మ...ళిచేతన్-ఆత్మ = తనయొక్క, కర = కాంతులయొక్క. అవళిచేతన్ = పంక్తిచేత (గుంపుచేత), బ్రహ్మ + ఆదులన్ = బ్రహ్మమొదలగువారిని, వేల్పులన్= దేవతలను, అఖిలజంతుగణములన్ = జంతురాసులనన్నింటిని, జగములన్ = ముల్లోకములను, ఘన....లతోన్ - ఘన=గొప్ప, నామ = పేరులయు, రూప=ఆకారములయు, భేదములతోన్ = మారుపాట్లతో, మెఱయించి = సృజించి, తగన్ = న్యాయముగా (సమయమున).

అడంచున్ = నశింపఁజేయునో, ఎవ్వఁడు, మనము = మనస్సును, బుద్ధి + ఇంద్రియములు = తెలివియు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును, తాను + అ + ఐ = తానుగానేయుండి, గుణసంప్రవాహంబున్ = సత్త్వరజస్తమో గుణములయొక్క కార్యములను, నెఱపున్ = పర్వఁజేయునో, స్త్రీ నపుంసక పురుషమూర్తియున్ + కాక=ఆఁడుది, పేఁడి, మగ యను మొదలగువాని రూపంబుగలదియుఁగాక, తిర్య .. ర్తియున్ కాక-తిర్యక్ = జంతువులు, అమర= దేవతలు, నర = మానవులు, ఆది = మొదలగువారి యొక్క, మూర్తియున్ + కాక = స్వరూపముగలదియుఁగాక, కర్మ.... కాశికాక - కర్మ = వ్యాపారములయొక్కయు, గుణ = సత్త్వరజస్తమోగుణముల యొక్కయు, సత్ = మంచియొక్కయు, అసత్ = చెడుపుయొక్కయు, ప్రకాశికాక = వెలుతురుగలదికాక, వెనుకన్ = సృష్టికాలంబున, అన్నియున్ తాను, అగువిభున్ = అగునట్టిపరమాత్మను, తలంతును=ధ్యానించెదను.

తా. సూర్యుఁడును అగ్నియుఁ దమకాంతుల నొకప్పుడు పర్వఁజేసి మఱియొకప్పుడు తమకాంతులను లోపలకీడ్చుకొనుదురో, అటులే భగవంతుఁడగు నే శ్రీమన్నారాయణమూర్తి భూమ్యాదిలోకంబులను, బ్రహ్మాది దేవతలను, చరాచరములగునన్నివస్తుజాలములను సృజించి,వానినన్నింటికిని నామరూపాదిభేదంబులనుగల్పించి ప్రళయంబునందు వానినన్నింటిని సంహరించి, తనలోనికిఁ జేర్చుకొనునో, ఎవ్వఁడు మనోబుద్ధిచిత్తాహంకారంబులును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములుఁ దానుగానే యుండి సత్త్వరజస్తమో గుణంబుల కార్యములఁ జేయుచుండి, పిదప నన్నియు లేనివాఁడగునో, స్త్రీపురుషనపుంసకరూపంబులలో నొక్కటియుఁగాక, దేవతలు, మానవులు, పశువులు మొదలగువాని రూపంబును గాక, కర్మంబులు గుణంబులు మొదలగువానిచేఁ గలుగుభేదమును బొందక, సత్స్వరూపుఁడును, అసత్స్వరూపుఁడును గాకయుండియుఁ బ్రళయంబున నన్నింటినిఁ దనలోపలికిఁ జేర్చుకొను పరమాత్మస్వరూపుండును, నిర్గుణుఁడు, నిర్వికారుఁడు, నిరంజనుఁడు నైన సర్వస్వరూపుఁడగు భగవంతునిఁ దలఁచుచున్నాను.

క. కలఁ డందురు దీనులయెడఁ
గలఁ డందురు పరమయోగి౯గణములపాలన్
గలఁ డందు రన్నిదిశలను
కలఁడు కలం డనెడువాఁడు ౯ కలఁడో లేఁడో. 70

టీ. దీనులయెడన్ = నొచ్చినవారిపాల, కలఁడు+అందురు = భగవంతుఁడున్నాఁ డని యందురు. పరమయోగిగణములపాలన్ = సమాధినిష్ఠగల యోగులచేరువను, కలఁడు + అందురు = ఉన్నాఁడని చెప్పుదురు. అన్నిదిశలను = అన్నిదిక్కులందును, కలఁడు + అందురు = ఉన్నాడని చెప్పుదురు, కలఁడు కలఁడు అనెడువాఁడు = ఉన్నాఁడున్నాఁడని చెప్పఁబడెడివాఁడు, కలఁడో=ఉన్నాడో, లేఁడో.

తా. ఆపన్నులు, యోగులు మొదలగువారియెడనుండి, సర్వదిక్కులందు నిండినవాఁడయిన భగవంతుఁ డున్నాఁడని పెద్దలు చెప్పుదురు. అట్టి భగవంతుని నే నెన్నివిధములఁ బ్రార్థించినను రాకున్నవాఁడు. అట్టి భగవంతుఁడు నాపాలిట నున్నాఁడో లేఁడో యని సంశయపడెదను.

సీ. కలుగఁడే నాపాలి ౯ కలిమి సందేహింపఁ
గలిమిలేములు లేక ౯ కలుగువాఁడు
నాకడ్డపడరాఁడె ౯ నలినసాధుపులచేఁ
బడినసాధుల కడ్డ ౯ పడెడువాఁడు
చూడఁడే నాపాటుఁ ౯ జూపులఁ జూడక
చూచువారలఁ గృపఁ ౯ జూచువాఁడు
లీలతో నామొఱా౯లింపఁడే మొఱఁగుల
మొఱ లెఱుంగుచుఁ దన్ను ౯ మొఱఁగువాఁడు

తే. అఖిలరూపులుఁ దనరూపమైనవాఁడు
ఆదిమధ్యాంతములు లేక యడరువాఁడు
భక్తజనముల దీనులపాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపఁడే వేగరాఁడె. 71

టీ. నాపాలికలిమి సందేహింపన్=నాయెడ భగవంతుఁ డున్నాఁడో లేఁడో యని సంశయపడుచుండఁగా, కలిమిలేములు లేక కలుగువాఁడు = ఒకప్పు డున్నాఁడు ఒకప్పుడు లేఁడను విభాగంబులేక యెల్లప్పుడు నుండు నట్టి భగవంతుఁడు, కలుగఁడే = నాకు తోడ్పడరాఁడా? నలిన్ = మిక్కిలి, అసాధువులచేన్=దుష్టులచేత, పడెడువారికి = బాధనొందువారికి, అడ్డపడెడువాఁడు =అడ్డమువచ్చువాఁడు, నాకు. అడ్డపడన్+రాఁడె=తోడుచేయరాఁడా? చూపులన్=కన్నులతో, చూడక, చూచువారలన్ = దివ్యదృష్టితోఁ దన్నుఁ జూచువారిని, కృపన్=దయతో, చూచువాఁడు=కాపాడెడువాఁడు, నాపాటున్ =నాశ్రమమును, (నాయవస్థను), చూడఁడే=చూడకయున్నాఁడే, మొఱఁగుల మొఱలు = మోసగాండ్రపలుకులు, ఎఱుఁగుచున్ = తెలియుచు, తన్ను మొఱఁగువాఁడు=తనను మోసపుచ్చువాఁడు, లీలతోన్=వేడుకతో, నామొఱ =నాయార్తధ్వని, ఆలింపఁడే=వినఁడే, అఖిలరూపములును, తనరూపము+ అయినవాఁడు = తన రూపముగానే యుండువాఁడును, ఆదిమధ్య + అంతములు=సృష్టిస్థితిలయములు, లేక, ఎడరువాఁడు = వృద్ధినొందువాఁడును, భక్తజనముల దీనులపాలివాఁడు = భక్తులయందును, నొచ్చినవారికడను ఉండువాఁడును, వినఁడె = (మొఱలను) వినఁడా, చూడఁడె = (నాయిడుములు) కనఁడే, తలఁపఁడే = మనంబున దయగొనఁడే, వేగరాఁడె = శీఘ్రముగా రాఁడే.

తా. జననమరణములు లేకయుండు భగవంతుఁడు నాపాలనున్నాఁడో లేఁడో యని నేను సంశయపడుచున్నాను. రాకయున్నాఁడు గదా! దుష్టులవలన బాధింపఁబడెడి సత్పురుషులను గాపాడెడి యాభగవంతుఁ డీ

మొసలిచే బాధపడుచుండు నన్నుఁ గాచుటకు నా కష్టమురాకయున్నాఁడె. ఇంద్రియములనుగెల్చి, జ్ఞానదృష్టితోఁ దనుఁ జూచువారినిఁ దనకడఁజేర్చు, వాఁడగు నీశుఁడు నాయవస్థలను గన్నులారఁ జూడకయున్నాఁడె. మాయా వేషధారులయి, లోపలభక్తిలేక పైకిభక్తులవలెఁ గాన్పించువారికిఁ బ్రత్యక్షము గానివాఁడగు భగవంతుఁడు నా దీనాలాపంబు లాలకింపకున్నాఁడే. ప్రపంచ మెల్లఁ దనరూపముగాఁగలిగి యుండుఁవాడును, సృష్టిస్థితిలయంబులు లేక సర్వకాల సర్వావస్థలయందును వెలుఁగుచుండువాఁడును, తన్నుఁగొలిచెడి భక్తులువిచారపడి, తన్నుధ్యానించునపుడువచ్చివారియాపదలఁబాపువాఁడునైన యాపరమేశ్వరుఁడు నామొఱలువిని, నాయవస్థలఁ దిలకించి, నాపై దయఁ దలఁచి, నన్నురక్షింప నెప్పుడువచ్చునో తెలియకున్నది.

క. విశ్వకరు విశ్వదూరుని
విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు
నీశ్వరునిం బరమపురుషు నే సేవింతున్. 72

టీ. విశ్వకరున్=ప్రపంచమును సృజించువాఁడును, విశ్వదూరునిన్= ప్రపంచమునకు వెలుపలనుండువానిని, విశ్వ + ఆత్మునిన్ = ప్రపంచ స్వరూపుని, విశ్వవేద్యున్ = అందఱిచే నెఱుఁగఁదగినవానిని, విశ్వున్ = సర్వస్వరూపుని, అవిశ్వున్ = ప్రపంచముకంటె వేఱయినవానిని, శాశ్వతున్ = ఎల్లప్పుడు నుండువానిని, అజున్ = పుట్టుక లేనివానిని, బ్రహ్మప్రభున్ = బ్రహ్మకంటె గొప్పవానిని, ఈశ్వరునిన్ = అన్నిఁటిని నేలెడువానిని, పరమపురుషున్ = పురుషోత్తముని, నేను, సేవింతున్ = కొలిచెదను.

తా. ప్రపంచమునకు సృష్టికర్తయయియుండియుఁ దాను బ్రపంచ మునకు వెలుపలనుండువాఁడును, ప్రపంచస్వరూపుఁడును, ప్రపంచముచే

నెఱుఁగఁదగినవాఁడును, మాయాసంబంధముచేఁ బ్రపంచస్వరూపుఁడై యుండి, మాయాసంబంధమును బాసినప్పుడు ప్రపంచమునకుం దనకేమి యును సంబంధములేక, తామరాకునందలి నీటిబొట్టువలె నంటియు నంటక యున్నవాఁడును, నిత్యుఁడును, బుట్టుకలేనివాఁడును, సృష్టికర్తయగుబ్రహ్మ కంటె మించినవాఁడును, పురుషోత్తముఁడునగు నీశ్వరుని నేను మ్రొక్కు చున్నాను.

వ. అని పలికి తనమనంబున నగ్గజేంద్రుం డీశ్వరసన్నిధా
నంబు గల్పించుకొని యిట్లనియె. 73

తా. అని యీప్రకారముచెప్పి యాగజరాజు దనమనస్సుననే యీ శ్వరుం డున్నట్లు తలఁచికొని యెదుటిమనుష్యునితో మాటలాడినట్లు మాట లాడఁ గడఁగెను.

శా. లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యెఁ
బ్రాణంబులున్, ఠావుల్దప్పెను మూర్ఛవచ్చెఁ దను
వున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్, నీవేతప్ప నితః
పరంబెఱుఁగ మన్నింపందగుం దీనునిన్, రావే
యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా! 74

టీ. లావు + ఒక్కింతయులేదు = బలము కొంచెమైనను లేదు, ధైర్యము = దిటవు, విలోలంబు + అయ్యెన్ = తప్పెను, ప్రాణంబులు + ఠావుల్ + తప్పెను = ప్రాణములుతమఠావులువిడిచికదలినవి, మూర్ఛవచ్చెన్ = మైమఱపుగల్గినది, తనువును = దేహముగూడ, డస్సెను = బడలెను, శ్రమంబు = అలసట, అయ్యెడిన్ = కలిగెను, నీవు + ఏ + తప్పన్ = నిన్నుఁదప్ప, ఇతఃపరంబు = ఇంతకంటె వేఱొక్కదానిని, ఎఱుఁగను, దీనునిన్ = నొచ్చినవానిని, మన్నింపన్ + దగున్ = తప్పిదములు

క్షమింపుము, ఈశ్వరా = ఓ ప్రభువా! రావే = రమ్ము! వరద = కోరిక లొసఁగువాఁడా! కావవే = రక్షింపుము! భద్ర + ఆత్మకా = దివ్యశరీరము గలవాఁడా! సంరక్షింపుము = బాగుగాఁ గాపాడుమయ్యా!

తా. ఓనాథా! నేనింతసేపు ఈమకరంబుతో వీలయినంతవఱకుఁ బోట్లాడితిని. నాబలం బుడిగినది ఇంతవఱకు నేను ఈమకరంబును జయింపఁగలనని తలఁచితి. ఆ ధైర్యము తొలఁగినది. ప్రాణములు పైకెగయుచున్నవి. మైకము వచ్చుచున్నది. దేహము బడలిక నొందినది. అలసట హెచ్చినది. ఇఁక నేను దీనితోఁ బోరలేను. నీవుదప్ప నా కొక్కరుఁడు తెలియదు. నేనిదివఱ కెన్నియపరాధంబులు చేసియున్నను వాని నెల్ల మన్నించి, యోభగవంతుఁడా! నాకడ కేఁగుదెంచి, నాబాధలఁ దొలఁగించి నన్నుఁ గాపాడుము.

క. విను దఁట జీవులమాటలు
చను దఁట చనరానిచోట్లకు శరణార్థుల కో
యను దఁట పిలిచిన సర్వముఁ
గను దఁట సందేహ మయ్యెఁ గరుణావార్ధీ. 75

టీ. కరుణావార్ధీ = దయకు సముద్రుఁడయినవాఁడా! జీవులమాటలు = నొచ్చినజనులపలుకులను, వినుదువు + అఁట = ఆలకింతువఁట, చనన్ + రాని చోట్లన్ = పోవరానిచోట్లకు, చనుదు + అఁట = పోదువఁట, శరణార్థులకున్ = శరణుఁజొచ్చినవారికి, పిలిచినన్ = వారు పిలిచినయెడల, ఓ + అనుదు + అఁట = ఇదిగో వచ్చుచున్నానని పలుకరింతువఁట, సర్వము = అంతయును కనుదు + అఁట = చూతువఁట, (ఇప్పుడు) సందేహము = సందియము, అయ్యెన్ = కలిగెను.

తా. ఓదయాసముద్రుఁడా! నీ వాపన్నులమాటలను వినుదువనియుఁ, బోవ వీలుగాని దుర్గములకుఁ బోదువనియు, శరణాగతులు నిన్నుఁ బిలిచిన,

నీవు ఓహో! ఇదిగో వచ్చుచున్నానని హెచ్చరించుకొందువనియుఁ జెప్పఁగా వినియున్నాను. ఇప్పుడే నే నింతసేపటినుండి పలుకరించినను నీవు రాకున్నందున నాకీమాటలన్నియు నిజమోకాదోయని సంశయము దోఁచుచున్నది.

ఉ. ఓకమలాక్ష యోవరద కయ్యోప్రతిపక్షవిపక్ష దూర ఓ
య్యో కవియోగివంద్యసుగుణోత్తమ, యోశరణాగతా
మరానోకహ యోమునీశ్వరమనోహరయోవిమలప్రభావ
రా, వే కరుణింపవే తలఁపవే శరణార్థిని నన్నుఁగావవే.

టీ. ఓకమలాక్ష=కమలంబులం బోలుకన్నులుగలవాఁడా! వరద= భక్తులకోర్కెలొసంగువాఁడా! ఓప్రతిపక్షవిపక్ష దూర = శత్రుపక్షముఁ బక్షములేనిదనములేనివాఁడా! కుయ్యో=ప్రోవుమా, కవియోగివంద్య=కవుల చేతను, మునులచేతను గొనియాడఁబడినవాఁడా! సుగుణ + ఉత్తమ = శ్రేష్ఠములైనసద్గుణంబులు గలవాఁడా! ఓశరణాగత+అమర+అనోకహ = ఓశరణుచొచ్చినవారికిఁ గల్పవృక్షమైనవాఁడా! ఓమునీశ్వర మనోహర = మునీంద్రులయొక్కమనస్సులను హరించువాఁడా! ఓవిమలప్రభావ = నిర్మల చరిత్రమహిమగలవాఁడా! రావే = రమ్ము, కరుణింపవే = దయఁజూడుమీ! తలఁపవే=స్మరణఁదెచ్చుకొనవే, శరణార్థివిన్+ నన్నున్+కావవే = శరణు చొచ్చిన నామాట లాలించి నన్నుఁ గాపాడుమీ!

తా. కమలంబుఁబోలుకన్నులుగల వాఁడవును, భక్తులకోర్కెలొసఁగు వాఁడవును, శత్రువులయెడ దయలేనివాఁడవును, పండితులచేతను, మునులచేతను సదా ధ్యానింపఁబడువాఁడవును, మేటిగుణంబులు గలవాఁడ వును, శరణుఁజొచ్చినవారికిఁ గల్పవృక్షముపలెఁ గోరినగోర్కు లొసఁగువాఁ డవును, యోగీంద్రులమనస్సులను హరించువాఁడవును, మహాప్రభావుండవు నైన యోభగవంతుఁడా! నేను నిన్ను శరణుఁజొచ్చితిని. నామొఱ నాలించి వేగముగ వచ్చి నాకష్టంబుఁ దొలఁగించి నన్నుఁ గాపాడుమయ్యా.

వ. అని పలికి మఱియు నరక్షితరక్షకుం డైనయీశ్వరుం
డాపన్నుండైన నన్నుం గాచుఁగాక యని నింగి నిక్కి
చూచుచు నిట్టూర్పులు నిగిడించుచు బయ లాలకించుచు
నగ్గజేంద్రుండు మొఱ సేయుచున్న సమయంబున. 77

టీ. అనిపలికి మఱియును, అరక్షితరక్షకుండు+ఐన = దిక్కులేని వారింగాపాడువాఁడయిన, ఈశ్వరుండు, ఆపన్నుండు=ఆపదనొందినవాఁడు, ఐననన్నున్, కాచున్+కాక = రక్షించునుగాక, అని, నింగిన్ = ఆకసంబునందు, నిక్కి = తొండమును చాఁచి, చూచుచున్, నిట్టూర్పులునిగిడించుచున్ = నిడివియైనూర్పులు విడుచుచు, బయలు+ఆలకించుచున్ = ఆకసంబువైపునకుఁ జెవియొగ్గి వినుచు, ఆ గజేంద్రుండు, మొఱసేయుచున్న సమయంబునన్ = మొఱలిడుచున్నపుడు,

తా. గజరాజీ ప్రకారము చాలసేపు చింతించి, యనాథులను గాపాడు భగవంతుఁడు నన్నురక్షించుఁగాక యని యాకసంబువైపునకుఁ దనతొండము చాఁచి వేఁడినిట్టూర్పులు విడుచుచు సర్వేశ్వరుఁ డేమైన బదులుమాటయిచ్చునోయని చెవియొగ్గివినుచు మొఱపెట్టుచున్నయవసరంబునందు.

ఆ. విశ్వమయత లేమి ♦ వినియు నూఱక యుండి
రంబుజాసనాదు ♦ లడ్డపడక
విశ్వమయుఁడు విభుఁడు ♦ విష్ణుండు జిష్ణుండు
భక్తియుతున కడ్డపడఁ దలంచె. 78

టీ. అంబుజ+ఆసన+ఆదులు=కమలముఆసనముగాఁగలబ్రహ్మ మొదలగు వేల్పులు, అడ్డపడక = అడ్డమురాక, విశ్వమయత = ప్రపంచస్వరూపులగుట, లేమిన్=లేకపోవుటచేత,వినియున్, ఊరకఉండిరి,విశ్వమయుఁడు=

ప్రపంచమే రూపంబుగాఁగలవాఁడును, విభుండు = అన్నిఁటి నేలువాఁడును, విష్ణుండు=అంతట వ్యాపించినవాఁడును, జిష్ణుండు=జయశీలుఁడును, (ఐన పరమాత్ముఁడు,) భక్తియుతునకున్ = భక్తితోఁ గూడినవానికి, అడ్డపడన్ = అడ్డము వచ్చుటకు, తలంచెన్ = ఎంచెను.

తా. ఇత్తెఱంగున గజేంద్రుఁడు వేఁడుచున్నను, బ్రహ్మమొదలగు వారు శక్తిలేమింజేసి, వినియు నాగజేంద్రునికిఁ దోడ్పడక యూరకుండిరి-అయినను, అప్పుడు శ్రీ మహావిష్ణుండు విశ్వరూపుండును, సర్వేశ్వరుండును, సర్వవ్యాపియు, సర్వోత్కృష్టుఁడు నగుటంజేసి తాను భక్తునకు నడ్డమువచ్చి, యతని యాపదఁ దొలగించి రక్షింపఁదలఁచినవాఁ డయ్యెను.

మ. అల వైకుంఠపురంబులో నగరులో నా మూలసౌధంబు
దాపల మందారవనాంతరామృతసరఃప్రాంతేందు
కాంతోపలోత్పలపర్యంక రమావినోదియగు నాపన్న
ప్రసన్నుండు విహ్వలనాగేంద్రము పాహిపాహి
యనఁ గుయ్యాలించి సంరంభియై. 79

టీ. అలవైకుంఠపురంబులోన్ = ప్రసిద్ధమగు వైకుంఠపట్టణమందు, నగరులోన్=రాజగృహంబున, ఆమూలసౌధంబుదాపలనన్= ఆ మూలయందుండు మేడచేరువను, మందార....వినోది అగు-మందార=కల్పవృక్షముల యొక్క, వన+అంతర=వనంబు నడుమనుండు, అమృతసరః=మంచినీటి కొలని యొక్క, ప్రాంత=చేరువనువొలుకెడి, ఇందుకాంత + ఉపల = స్ఫటికమణులవంటి, ఉత్పల=నల్లకలువలయొక్క, పర్యంక=పాన్పునందు, రమా = లక్ష్మీదేవితో, వినోది = వేడుకగా విహరించుచుండునట్టివాఁడగు, ఆపన్నప్రసన్నుండు=నొచ్చినవారియెడ కరుణించువాఁడు, (భగవంతుఁడగు విష్ణుమూర్తి) విహ్వలనాగ+ ఇంద్రము = మిక్కిలి నొచ్చిన గజరాజు-

పాహి పాహి = కాపాడుము కాపాడుము, అనన్ = అనఁగా, కుయ్యి + ఆలించి = మొఱవిని, సంరంభియై = త్వరతోఁ గూడినవాఁడై,

తా. వైకుంఠమున రాజనగరులోపలి గొప్పమేడయందుఁ గల్ప వృక్షంబుల యుపవనంబునందలి యమృతసరోవరము యొక్క చెంతను, జంద్రకాంతమణులు చెక్కి కలువపూవులు పఱచిన పాన్పునందు శ్రీ లక్ష్మీ దేవితోఁగూడ విహరించుచుండు వాడఁగు నాపన్నజనసంరక్షణ దయుఁడు శ్రీమన్నారాయణమూర్తి తనభక్తుఁడగు గజరాజు నొచ్చినవాఁడై పాహి : నన్నుఁగావుము కావుము అని ప్రార్థించుచుండఁగా నామొఱను విని త్వర పడుచు లేచి,

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సం
ధింపఁడే, పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ
డాకర్ణికాం, తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదో
త్ప్రోత్థితశ్రీకుచో, పరిచేలాంచలమైన వీడఁడు గజప్రా
ణావనోత్సాహి యై. 80

టీ. గజప్రాణ+అవన+ఉత్సాహి+ఐ=ఏనుఁగుయొక్క ప్రాణములను గాపాడుటయందే పట్టుదలగలవాఁడై, సిరికిన్ = లక్ష్మీదేవితో, చెప్పఁడు శంఖచక్రయుగమున్ = శంఖమును జక్రము అనునీరెంటిని, చేదోయిన్ = తనరెండుచేతులందును, సంధింపఁడు=తొడుగఁడు, పరివారంబును=లోనుపని వారిని, చీరఁడు=పిలువడు, అభ్రగపతిన్ = గరుత్మంతునిమీఁదఁబోవుటకు, పన్నింపఁడు = అయితము చేయఁడు. ఆకర్ణిక....ధమ్మిల్లమున్ - ఆకర్ణిక+ అంతర=చెవులవఱకును వ్రేలాడుచున్న, ధమ్మిల్లమున్=వెండ్రుకలముడిని, చక్కన్+ఒత్తఁడు=సరిదిద్దడు, వివాద....అంచలము+ఐనన్-వివాద = ప్రణయకలహమందు, ప్రోత్థిత=రఁడ్చిపట్టుకొనఁబడిన, శ్రీ=లక్ష్మియొక్క, కుచ=స్తనములందలి, ఉపరిచేల+అంచలము+ఐనన్=పైఁటకొంగునైనను, వీడఁడు=విడువఁడు.

తా. అట్లు శ్రీమన్నారాయణుండు తాను భక్తపరాధీనుఁడు గావునఁ దనభక్తుఁడగు గజేంద్రునియాపదఁ దొలఁగించి కాపాడఁగోరి బయలుదేఱి, యాతొందరలో లక్ష్మీదేవితోను జెప్పక, శంఖచక్రములను ధరింపక, బంటులనుగూడఁ దీసికొనక, గరుడునిమీఁద నెక్కక, జాఱినజుట్టు ముడివేసికొనక, లక్ష్మీదేవితో నొకప్పుడు వాదులాడుచుండి వేడుకకై తానీడ్చిపట్టిన యాపె పైఁటకొంగునుగూడ విడువక యాపైఁటకొంగు నీడ్చుచునే బయలువెడలెను.

వ. ఇట్లు భక్తజనపాలనపరాయణుండును నిఖిలజంతుహృదయారవిందసదనసంస్థితుండును నగు నారాయణుండు కరికులేంద్రవిజ్ఞాపిత నానావిధదీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతా వినోదంబులం దగులు సాలించి సంభ్రమించి దిశలు నిరీక్షించి గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మరల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయునప్పుడు, 81

టీ. ఇట్లు, భక్తజనపాలనపరాయణుండును = భక్తులగు జనులను రక్షించుటయె ముఖ్యకార్యముగాఁగలవాఁడును, నిఖిల... సంస్థితుండును — నిఖిల=అన్ని, జంతు=ప్రాణులయొక్క, హృదయ+అరవింద = కమలములవంటి మనస్సనెడు, సదన=ఇంటియందు, సంస్థితుండును=బాగుగా నమరియున్నవాఁడును, అగునారాయణుండు, కరి....లాపంబులు — కరికుల + ఇంద్ర = ఏనుఁగుగుంపుల మేటియొక్క, నానావిధ = పలుతెఱఁగులగు, దీనాలాపంబులు=దేవురింపుమాటలు, ఆకర్ణించి, లక్ష్మీకాంతావినోదంబులన్= లక్ష్మీదేవితోడి చెలగాటలందు, తగులు = ఇష్టము, చాలించి = విడిచి, సంభ్రమించి = తత్తరపడి, దిశలు నిరీక్షించి = దిక్కులుచూచి, గజేంద్రరక్షాపరత్వంబును=గజేంద్రుని రక్షణమే ప్రధానకార్యముగాఁ గలిగియుండుటను,

అంగీకరించి = ఒప్పుకొని, (మనస్సునుంచి) నిజపరికరంబున్ = తన యాయుధంబులను, మరలన్=పోవుటకు, అవధరించి=ఆనతిచ్చి, గగనంబు నకున్ ఉద్గమించి=ఆకసంబున కెగిరి, వేంచేయునప్పుడు=బయలుదేరినపుడు,

మ. తనవెంటన్సిరి లచ్చివెంట నవరోధవ్రాతము న్దానివె,
న్కనుబక్షీంద్రుఁడు వానిపొంతను ధనుఃకౌమోదకీ
శంఖచక్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు
రా వచ్చి రొయ్యన వైకుంఠపురంబునంగలుగువా
రాబాల గోపాలమున్. 82

టీ. తనవెంటన్ = తనవెంబడి, సిరి=లక్ష్మీదేవియు, లచ్చివెంటన్= లక్ష్మీదేవివెంబడి, అవరోధవ్రాతమున్=అంతఃపురాంగనల సమూహమును, దాని వెన్కన్=అంతఃపురాంగనాజనమువెంబడి, పక్షీంద్రుఁడు=గరుత్మంతుఁడును, వానిపొంతను = ఆగరుత్మంతునివెంబడి, ధనుఃకౌమోదకీశంఖచక్రనికాయంబును = శార్ఙ్గమనువిల్లు, కౌమోదకీయనుగద, పాంచజన్యమను శంఖము, సుదర్శనమనుచక్రము లను వీనిసముదాయమును, నారదుఁడున్, ధ్వజినీకాంతుండు = సేనానాయకుఁడు, (విష్వక్సేనుఁడు) రాన్ = రాఁగా, వైకుంఠపురంబునన్ + కలుగువారు = వైకుంఠపురనివాసులు, ఆబాల గోపాలమున్=పిల్లలు మొదలు గొల్లలవఱకును, ఒయ్యన=తిన్నఁగా,వచ్చిరి.

తా. భక్తరక్షణతత్పరుండగు శ్రీమన్నారాయణమూర్తి యట్లు త్వరపడుచుఁబోవునపుడు, కారణ మేమో తెలియఁగోరి లక్ష్మీదేవి యాతనిని వెంబడించెను. ఆలక్ష్మి వెంబడి నంతఃపురాంగన లందఱు వచ్చిరి. వారిని గరుత్మంతుఁడు వెంబడించెను. ఆగరుత్మంతుని వెంబడి శంఖచక్రగదాధనురాదులగునాయుధంబులు వచ్చినవి. వానివెంబడి నారదమహర్షియు విష్వక్సేనుఁడును వచ్చిరి, వారివెంబడి వైకుంఠములో నున్న జనులు పిల్లలు మొదలు గొల్లలవఱకు నొక్కరు తప్పక యందఱును వచ్చిరి.

వ. తదనంతరంబ ముఖారవిందమకరంద బిందుసందోహ
పరిష్యందమానానందదిందిందిరయగు నయ్యిందిరాదేవి
గోవిందకర సమాకృష్యమాణసంవ్యానవేలాంచల యై
పోవుచు, 83

టీ. తత్ + అనంతరంబ = ఆవిష్ణుమూర్తివెంబడి, ముఖా...దిర-ముఖ=మోమనెడి, అరవింద = కమలముయొక్క, మకరంద = పూఁదేనెయొక్క, బిందు=బొట్లయొక్క, సందోహ = గుంపుయొక్క, పరిష్యందమాన = అంతట కాఱుటచేత, ఆనందత్=సంతోషపడుచున్న, ఇందిందిర=తుమ్మెదలుగలది, అగు, ఆ, ఇందిరాదేవి = లక్ష్మీదేవి, గోవిం....చల ఐ-గోవింద=విష్ణువుయొక్క, కర = చేతిచేత, సమాకృష్యమాణ = చక్కఁగా నీడువఁబడుచున్న, సంవ్యానవేల = పైఁటకొంగుయొక్క, అంచల + ఐ=కొనగలదై, పోవుచు,

తా. ఆలక్ష్మీదేవి తనముఖమను కమలమునుండి స్రవించు పూఁదేనెను గ్రోలుటకై తుమ్మెదలు మోమున వ్రాలియుండఁగాఁ దనకొంగు విడిచిపెట్టక శ్రీవిష్ణుఁవు మఱపుచే నీడ్చుకొని పోవుచుండఁగా నాతనిని వెంబడించి పోవుచు నిట్లు తలపోసెను.

మ. తనవేంచేయుపదంబుఁ బేర్కొనఁ డనాథస్త్రీజనాలాప
ముల్ వినెనో, ప్రముచ్చులు ప్రముచ్చిలించిరొ ఖలుల్వేద
ప్రపంచంబులన్, దనుజానీకము దేవతానగరిపై కదం
డెత్తెనో, భక్తులంగని చక్రాయుధుఁ డేఁడి చూపుఁ డని
ధిక్కారించిరో దుర్జనుల్. 84

టీ. (విష్ణుండు) తనవేంచేయుపదంబున్ = తాను పోయెడిచోటును, పేర్కొనఁడు=చెప్పఁడు, (ఆతఁడు) అనాథస్త్రీజన+ఆలాపముల్=దిక్కు

లేని యాఁడువారియొక్క మొఱలను, వినెనో, ప్రముష్టులు = మూష్టులైన, ఖలుల్ = దొంగలు, వేదప్రపంచంబులన్ = వేదములసమూహములను, ముచ్చిలించిరో=దొంగిలించిరో, దనుజ+అనీకము=అసురసేన, దేవతానగరిపైన్= స్వర్గముమీఁద, దండెత్తెనో=దాడివెడలెనో, దుర్జనులు = హిరణ్యకశిపుఁడు మొదలగు చెడునడతయందుఁ బోవువారు, భక్తులన్=ప్రహ్లాదుఁడు మొదలగువారిని, కని, చక్రాయుధుఁడు=విష్ణువు, ఏడి=ఎక్కడ, చూపుఁడు, అని ధిక్కరించిరో = తిరస్కరించిరో,

తా. శ్రీమన్నారాయణుండు తా నెచ్చటికిఁ బోవుచున్నాఁడో చెప్పఁడు. ద్రౌపది మున్నగు నాదరువులేని స్త్రీ లెవరైనను నాథా! మమ్ము రక్షింపుము అని పిలిచినమాటలను వినెనో, సోమకుఁడు మొదలగు బ్రహ్మరాక్షసులు వేదములను దొంగిలించికొనిపోయిరో, అసురులు ఇంద్రుని నగరిపై దండెత్తివచ్చిరో, దుర్జనులు భక్తులం జూచి "ఏడీ విష్ణువును జూపుఁ" డని తిరస్కరించి యడిగిరో,

వ. అని వితర్కించుచు, 85

తా. ఈప్రకారము లక్ష్మీదేవి తనమనంబునఁ దా ననుకొనుచు,

శా. తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో,
శాటీముక్తకుచంబుతో నదృఢచంచత్కాంచితోఁ శీర్ణ
లాలాటాలేపముతో మనోహరకరాంలగ్నోత్తరీయం
బుతోఁ, గోటీందుప్రభతో మనోజసరసంకోచద్వి
లగ్నంబుతోన్. 86

టీ. తాటంక+ఆచలనంబుతోన్=కమ్మలయొక్క యదరుపాటుతో, భుజనటత్+ధమ్మిల్లబంధంబుతోన్-భుజ=మూఁపులందు,నటత్=తిరుగుచున్న, ధమ్మిల్లబంధంబుతోన్=కొప్పుముడితో, శాటీముక్త=పైఁటతొలఁగిన, కుచరు

బహోన్=స్తనములతో, అదృఢ=వదులైనందున, చంచత్ = కదలుచున్న, కాంచితోన్=మొలనూలితో, శీర్ణ....ముతో-శీర్ణ=మాసిపోయిన, లాలాట=నొసటఁబెట్టికొన్న, ఆలేపముతో=బొట్టుతో, మనోహర...రీయంబుతోన్-మనోహర=అందమయిన, కర=చేతియందు, ఆలగ్న=చిక్కుకొన్న, ఉత్తం యంబుతోన్ = పైఁటతో, కోటి + ఇందుప్రభతోన్ = కోటిచంద్రులం బోలుకాంతితో, ఉరోజ...గ్నంబుతోన్-ఉరోజ = స్తనములనెడు, భర = బరువుచేత, సంకోచత్=మిక్కిలి ముడుచుకొన్న, వలగ్నంబుతోన్ = నడుముతో (కూడినదై),

తా. (లక్ష్మీదేవి) తనప్రాణనాథుఁడు పోవునపుడు ఏల పోవుచున్నాఁడో, ఎక్కడికిఁ బోవుచున్నాఁడో తెలియమిచే నాసంగతిఁ దెలియఁ గోరి తావుతొలఁగి యుండుకమ్ములు సరిసేసికొనకయు, వీడిపోయియున్న కొప్పును చక్కఁగాఁ దుఱుముకొనకయుఁ, దనకుచంబులపైఁ దొలఁగి యున్నపైఁటను సరిగా వేసికొనకయు, వదులుగానుండినందున కదులుచున్న మొలనూలిని బిగియఁగట్టుకొనకయుఁ గోటిచంద్రులకాంతింబోలు మొగము నందముతోఁ గూడినదై, నొసట బొట్టు మాసిపోయి యుండఁగాఁ, దనపైఁటచెఱంగు తనప్రాణనాథుఁడు చేతితో లాగికొనిపోవుచుండఁగా స్తనభారముచే వంగిన నడుముగలదై,

క. అడిగెదనని కడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడువఁ డని నడ యుడుగున్
వెడవెడఁ జిడిముడి తడఁ బడ
నడు గిడు నడు గిడదు జడిమ నడు గిడునెడలన్. 87

టీ. అడిగెదన్+అని=(తననాథుఁడు ఎచ్చటి కేఁగుచున్నాఁడో) అడిగి తెలిసికొనెదనని, కడువడిన్=మిక్కిలితొందరతో, చనున్=పోవును, అడిగినన్ = అడిగినపిమ్మట, తనున్+ మగుడన్+నుడువఁడు+అని = పవి

తొందరలో బదులుచెప్పునో చెప్పఁడో అని, నడ+ఉడుగున్=వెనుకడుగు పెట్టును, వెడవెడన్=మెల్లమెల్లఁగా, చిడిముడితడఁబడన్ = తొట్రుపాటు కలుగుచుండఁగా, అడుగు+ఇడున్=ముందుకునడచును, అడుగు + ఇడు నెడలన్=అడుగుపెట్టునపుడు, జడిమన్=వెఱపుచేత, అడుగు + ఇడదు = కాలెత్తిపెట్టదు.

తా. ఆలక్ష్మీదేవి ముందుకుఁబోయి తనప్రాణనాథుఁడంత వేగిరముగా నెచ్చటికేఁగుచున్నాఁడో తెలియఁగోరి ముందు కడుగుపెట్టును. తన కతఁడు బదులుసెప్పునో సెప్పఁడో యని యడుగు బెట్టకుండును. మరల మెల్లమెల్లఁగా తొట్రుపాటుతోఁగూడ నొకయడుగు ముందుకుఁబెట్టఁబోయి యేమనునో యని వెఱచి యడుగుపెట్టక నిలచిపోవును.

సీ. నిటలాలకము లంట ఽ నివుర జుంజుమ్మని
　　　ముఖసరోజము నిండ ఽ ముసరుఁదేఁటి
లళులఁ జోపఁగఁ జిల్క ఽ లల్లనల్లనఁజేరి
　　　యోష్ఠబింబద్యుతు ఽ లొడియ నుఱుక
శుకములఁ దోలఁ జక్షుర్మీనములకు సం
　　　దాకినీపాఠీనఽలోక మెసఁగ
మీనపంక్తులు దాఁట ఽ మెయిదీఁగెలో రాయ
　　　శంపాలతలు మింట ఽ సరణిగట్టు

తే. శంపలను జయింపఁ ఽ జక్రవాకంబులు
కుచయుగంబుఁ దాఁకి ఽ క్రొవ్వు సూపు
మెలఁత మొగులుపిఱుఁదిఽమెఱుఁగుదీఁగెయుబోలె
జలదవర్ణువెనుకఁ ఽ జనెడునపుడు, 88

టీ. మెలఁత=ఆలక్ష్మీదేవి, మొగులు పిఱిఁది మెఱుఁగుఁ దీగయున్+పోలెన్=మబ్బుయొక్క వెనుకనుండెడి మెఱపుఁదీఁగవలె, జలదవర్ణువెనుకన్=కాఱుమేఘంబువంటి వన్నెగల విష్ణువు వెంబడి, చనెడునపుడు=పోవు సమయంబున, నిటల+అలకములు=నొసటియందలిముంగురులు,అంటన్+నివురన్=అఁగునట్లు చక్కఁబఱపఁగా, తేఁటులు=తుమ్మెదలు, ముఖసరోజము = ముఖమనెడికమలము, నిండన్ = నిండునట్లు, జుంజుమ్మని = జుంజుమ్మనుచు, ముసరున్ = మూఁగును, అళులన్ = తుమ్మెదలను, చోపఁగన్ = తోలఁగా, చిల్కలు = చిలుకలు, అల్లనల్లనన్=మెల్లమెల్లఁగా, చేరి = సమీపించి, ఓష్ఠబింబద్యుతులు = పెదవులనెడి దొండపండుయొక్క కాంతులు, ఒడియన్ = పీల్చుటకు, ఉఱుకున్ = దుముకును, శుకములన్=చిలుకలను, తోలన్=వెడలఁగొట్టఁగా చక్షుర్మీనములకున్ = కన్నులనెడు చేఁపలకై, మందాకినీ పాఠీనలోకము = గంగానదియందలి వేయికోలల చేఁపలగుంపులు, ఎసఁగున్ = చుట్టుకొనును, మీనపంక్తులు = చేఁపల వరుసలు, దాఁటన్ = తప్పిపోఁగా, మెయిదీఁగెతోన్ = శరీరమనెడితీఁగతో, రాయన్ = ఒరుసుకొనుటకు, శంపాలతలు = మెఱపువరుసలు, మింటన్ = ఆకసమునందు, సంఘటిల్లును=వరుసలుదీఱును, శంపలను = మెఱుపులను, జయింపన్ = గెల్వఁగా, చక్రవాకంబులు = జక్కవపిట్టలు, కుచయుగంబున్ = స్తనములజంటను, తాఁకి = ఎదిరించి, క్రొవ్వుసూపును = గర్వమును గనఁబఱుచును.

తా. ఆలక్ష్మీదేవి మేఘముపెంబడి మెఱుపుపోవునట్లు నీలమేఘచ్ఛాయగల శ్రీమహావిష్ణువు వెంబడించి పోవుచుండఁగా, నామెయొక్క నొసటనుండు ముంగురులను జూచి, వానికాంతి మీరుటకై తుమ్మెదలు గుంపులుగ నాలక్ష్మీదేవియొక్క మోమునిండ మూఁగెను. తుమ్మెదలను దోలునప్పటికి, నాలక్ష్మీదేవి పెదవియనుదొండపండును బొడుచుటకై చిలుకలు వ్రాలెను. ఆ చిలుకలను తోలఁగా, మందాకినీనదియందలి పెద్దచేఁప లామె నేత్రములనెడి చిఱుచేఁపలను దినుటకు వ్యాపించెను. చేఁపలగుంపును దోలి

వేయఁగా శరీరమసులతతో నొఱమిటకై మెఱపులాసనంబుసి పరుసిఁపు చేనెను. మెఱపులసు గెల్చునప్పటికి జక్కవపిట్టలు స్తనంబుఁ నెచిరించి విసపరా క్రమంబు కనఁబఱచెను. అనఁగా కమలములంవోలు మోముసు, తుమ్మెదల వలె నల్లనైన ముంగురులును, దొండపండ్లవంటి పెదవులును, చేఁపలవంటి కన్నులును, మెఱుపువంటి దేహచ్ఛాయయుఁ దీఁగెవంటి మేనును, జక్కవాకంబు వలె గదిసియుండు స్తనంబులును గలదగు లక్ష్మీదేవి మేఘము వెంబడి మెఱపువలె, మేఘమువంటిచాయగల నారాయణమూర్తిని వెంబడించెను.

— ఈ పద్యమున తుమ్మెదలు మోమును బద్మమనియు, చిలుకలు పెదవులను దొండపండనియు, వేయికోటుల చేఁపలు కన్నులసు ఱుంచేఁపలనుగా భ్రమించుటచే భ్రాంతిమదలంకారము.

మ. వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ సురవిష్ణు స్సురా
రాతిజీ, వనసంపత్తి నిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు
యోగీంద్రహృ, ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలంకరిష్ణు
నవోఢోల్లస దిందిరాపరిచరిష్ణున్
జిష్ణు రోచిష్ణునిన్. 89

టీ. వినువీధిన్=ఆకాశమార్గమునందు, చనుదేరన్=బయలుదేరగా, అమరుల్ = దేవతలు, సురా....నిరాకరిష్ణున్-సురారాతి=వేల్పులకు శత్రువులగురాక్షసులయొక్క, జీవన = బ్రదుకుటయును, సంపత్తి = భాగ్యమును నిరాకరిష్ణున్=పోగొట్టుటయే స్వభావముగాఁగలవాఁడును, కరుణావర్ధిష్ణున్=దయచే నిండిన స్వభావముగలవాఁడును, యోగీ....ర్తిష్ణున్ - యోగి + ఇంద్ర=మేటియోగులయొక్క, హృత్=మనస్సనెడు, వన = అరణ్యమందు, వర్తిష్ణున్=ఉండువాఁడును, సహిష్ణున్=ఓర్పుగలవాఁడును, భక్త....రిష్ణున్ భక్తజన = ఆశ్రయించువారియొక్క, బృంద = గుంపుయొక్క, ప్రాభవ= ప్రభుత్వమును, అలంకరిష్ణున్=అలంకరించువాడుఁను,నవోఢ...రిష్ణున్—నవ

+ ...ధి = క్రొత్తపెండ్లికూతురివలె, ఉల్లసత్=వెలుఁగుచుండు, ఇందిరా=లక్ష్మీదేవి, పరిచరిష్ణున్ = పనికత్తెగాఁగలవాఁడును, జిష్ణున్ = శత్రువులను గెల్చు స్వభావముగలవాఁడును, రోచిష్ణున్ = వెలుఁగుస్వభావముగలవాఁడునైన, విష్ణున్ = వ్యాపనశీలుఁడైన నారాయణమూర్తిని, కాంచిరి=చూచిరి.

తా. రాక్షసుల ప్రాణముల ముగించువాఁడును, దయాసముద్రుఁడును, యోగీంద్రులహృదయమం దుండువాఁడును, భక్తులకు మహిమ నొసఁగువాఁడును, ఆశ్రితుల తప్పిదము మన్నించువాఁడును, సర్వదా పెండిలికూఁతురివలె, వెలుఁగుచుండునట్టి లక్ష్మీదేవిచేఁ గొల్వఁబడుచుండువాఁడును, జయశాలియు, వెలుఁగు స్వభావముగలవాఁడు నైనయావిష్ణుమూర్తి యాకాశమునఁ బఱతెంచుచుండఁగా వేల్పు లతనిఁ జూచిరి.

వ. ఇటు పొడగని, 90

టీ. పొడగని=చూచి,

తా. దేవతలు నభోమార్గమునఁ బోవుచుండు విష్ణువునుజూచి,

మ. చనుదెంచెన్ ఘనుఁడల్లవాఁడె హరిపజ్జంగంటిరే
లక్ష్మి శంఖనినాదం బదె చక్ర మల్లదె భుజంగ
ధ్వంసియు న్వాఁడె క్రన్నన నేతెంచె నటంచు వేల్పులు
నమో నారాయణాయేతి నిస్స్వనులై మ్రొక్కిరిమింట
హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్. 91

టీ. అల్లవాఁడె=అదిగో, ఘనుఁడు=గొప్పవాఁడగు, (విష్ణువు) చనుదెంచెన్=వెడలెను, హరిపజ్జన్=విష్ణువుయొక్క వెంబడి, లక్ష్మిన్ = లక్ష్మీదేవిని, కంటిరే=చూచితిరా! శంఖవినాదంబు = సంకువుయొక్క మ్రోఁత, అదె = అదిగో, చక్రము = సుదర్శనము, అల్లదె = అదిగో, భుజంగధ్వంసియున్ = గరుడుఁడును, వాఁడె = అదిగో, క్రన్ననన్ = వెంబడె,

ఏతెంచెను; అటంచున్, వేల్పులు = దేవతలు, నమోనారాయణాయ + ఇతి విస్స్వనులై = ఓమ్ నమోనారాయణాయ అని ధ్వనులుగలవారై, మింటన్ = ఆకసమునందు, (ఉండి), హస్తిదురవస్థాపక్రికిన్=గజేంద్రుని యొక్క యిడుమను బోఁగొట్టుటకుఁ బూనినవాఁడయిన, చక్రికిన్ = చక్రాయుధధారియగు విష్ణువునకు, మ్రొక్కిరి = నమస్కరించిరి.

తా. అట్లు వేల్పులందఱుగూడి, "అదిగో! విష్ణువు వచ్చుచున్నాఁడు. అదిగో! లక్ష్మి యాతనివెంబడి వచ్చుచున్నది. అదిగో! పాంచజన్యము యొక్క ధ్వని వినఁబడుచున్నది. చక్రముగూడఁ గానఁబడుచున్నది. వాని వెంబడి గరుత్మంతుఁడు వచ్చుచున్నాఁడు" అని చెప్పుకొనుచు, నా గజేంద్రునిఁ గాపాడుటకై పోవుచున్న చక్రాయుధధారియగు విష్ణువునకు "నమోనారాయణాయ" యని చెప్పుచు మ్రొక్కినవారైరి.

వ. అయ్యవసరంబునఁ గుంజరేంద్రపాలన పారవశ్యంబున దేవతా నమస్కారంబు లంగీకరింపక మనస్సమాన సంచారుండై పోయి పోయి కొంతదూరంబున సంసారచక్రంబునుం బోలె గురుమకరకుటీరమైనమిథునసంబై కిన్నరేంద్రునిభాండాగారంబునుంబోలె స్వచ్ఛవరకచ్ఛపంబై భాగ్యవంతుని భాగధేయంబునుం బోలెఁ బరాగజీవనంబై వైకుంఠపురంబునుంబోలె శంఖచక్రకమలాలంకృతంబై సంసార ప్రకారంబునుంబోలె ద్వంద్వసంకులపంకసంకీర్ణంబై యొప్పు నప్పంకజాకరంబుఁ బొడగని, 92

టీ. ఆ + అవసరంబున్ = అట్లు వేల్పులు కొనియాడుచుండగా, కుంజర + ఇంద్రపాలనపారవశ్యంబునన్ = గజరాజుయొక్క రక్షణమునందలి

గమనముచేత, దేవతానమస్కారంబులు = వేల్పులయొక్క దండములు, అంగీకరింపక = ఆదరింపక, మనస్సమానసంచారుండు + ఐ = మనో వేగముతో సాటియగువేగముగలవాఁడై, పోయిపోయి = చాలదూరంబేఁగి, కొంతదూరంబునన్=కొంతదవ్వున, శింశుమారచక్రంబునుంబోలెన్ = శింశు మారచక్రమువలె, (కొలనిపరమున) గురు....థునంబు+ఐ - గురు=గొప్ప, మకర = మొసళ్లయొక్క, కుళీర = ఎండ్రకాయలయొక్క, మీన = చేపల యొక్క, మిథునంబు + ఐ=దంపతులుగలదై. (శింశుమారచక్రపక్షమున) గురు = బృహస్పతియు, మకర = మకరరాశి, కుళీర = కర్కటరాశి, మీన= మీనరాశి, మిథునంబు+ఐ = మిథునరాశియుంగలదై, (ఆకొలను శింశు మారచక్రమువలె గురుమకరకుళీరమీనమిథునంబై యున్నది) (కొలనిపక్ష మున) మొసళ్లు, ఎండ్రకాయలు, చేఁపలదంపతులున్నవి యని తాత్పర్యము. (శింశుమారచక్రమునందు గురుగ్రహము, మకర, కర్కట, మీన, మిథున రాసు లున్నవి యని భావము.) కిన్నర+ఇంద్రుని భాండాగారంబునుం బోలెన్ = కిన్నరుల యధిపుఁడగు కుబేరునియొక్క బొక్కసమువలె, స్వచ్ఛవరకచ్ఛపంబు+ఐ = (కొలనిపక్షమున) తెల్లగొప్పతాఁబేళ్లుగలదై, (కుబేరుని బొక్కసముపక్షమున) శ్రేష్ఠములగు వరము, కచ్ఛపము అను పేరులుగల నిధులు గలదై, (కొలనును కుబేరుని బొక్కసమును స్వచ్ఛ వరకచ్ఛపముయియున్నది. అనఁగా కొలనియందు తెల్లని మేటితాఁబే ళ్లున్నవి యనియు బొక్కసమందు "వరకచ్ఛపములు" అను పేరుగల నిధు లున్నవనియు వాస్తవార్థము.) భాగ్యవంతుని భాగధేయంబునుం బోలెన్=ధనికునియదృష్టమువలె, పరాగజీవనంబు + ఐ-(కొలనిపక్షమున) పరాగ = పుప్పొడితోఁగూడిన, జీవనంబు + ఐ = నీరుగలదై, (ధనికుని యదృష్టపక్షమున) పరాగ = ప్రసిద్ధితోఁగూడిన, జీవనంబు + ఐ = వృత్తి గలదై, కొలనును ధనికునిభాగ్యమును పరాగజీవనంబై యున్నది. (అనఁగా కొలనుయందునీళ్లు పుప్పొడిగలవిగనున్నవి. ధనికుఁడు శ్రేష్ఠమగుజీవనము గలవాఁడని యభిప్రాయము.) వైకుంఠపురంబునుంబోలెన్ = వైకుంఠపట్ట

ఱమువలె, శంఖ....కృతంబు+ఐ—(కొలనిపక్షమున)శంఖములు, చక్రవాకములు, కమలములు వీనిచే నలంకరింపబడినదై, (వైకుంఠపక్షమున)పాంచజన్యము, సుదర్శనము, లక్ష్మీదేవి వీనిచేశోభిల్లినదియు, (కొలనును వైకుంఠమును శంఖచక్రకమలాలంకృతమునై యున్నది. అనఁగా కొలనియందు శంఖములు, చక్రవాకములు, కమలములున్నవియనియు, వైకుంఠమున శంఖచక్రాయుధములును, లక్ష్మీదేవియు నున్నారు అనియు వాస్తవాభిప్రాయము.) సంసారప్రకారంబునుంబోలెన్=కుటుంబరీతివలె, ద్వంద్వ. .. కర్ణంబు+ఐ (కొలనిపక్షమున) ద్వంద్వ = కరిమకరంబుల పోరుసందు. సంకుల = కలిగిన, పంక = బురదతో, సంకీర్ణంబు+ఐ=మిక్కిలివ్యాపింపఁబడినదై, (సంసారపక్షమున) ద్వంద్వ=చలివేఁడులు, సుఖదుఃఖములు, కలిమిలేములు ననెడిజంటలతో, సంకుల=కూడిన, పంక = దుఃఖముతో, సంకీర్ణంబు+ఐ=నిండినదై, (కొలనును సంసారమునుద్వంద్వసంకులపంకసంకీర్ణములు, అనఁగా కొలనునందు కరిమకరంబుల పోరుచే నడుసంతయుఁగలఁగి గుంటయంతయు నిండియున్నదని, సంసారము శీతోష్ణములు, కలిమిలేములు, సుఖదుఃఖములు ననువానివలనఁ గలుగువ్యసనంబుతోఁ గూడియుండును అని యభిప్రాయము. గురుమకరకుళీరమీన మిథునములు, వరకచ్ఛపములు, వరాగజీవనము, శంఖచక్రకమలాలంకృతము, ద్వంద్వసంకులపంకసంకీర్ణము — వీనియందు శ్లేషమూలకాభేదాధ్యవసాయము.) ఒప్పు, అప్పంకజాకరమున్ = ఆతామరకొలనిని, పొడగని = చూచి,

మ కరుణాసింధుఁడుశౌరి వారిచరమున్ ఖండింపఁగాఁబంపెస
త్వరితాకంపితభూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా, పరిభూతాంబరశుక్రమున్బహువిధబ్రహ్మాండ భాండచ్ఛటాంతర నిర్వక్రముఁబాలితాఖిలసుధాంధశ్చక్రమున్ జక్రమున్. 93

టీ. కరుణాసింధుఁడు = దయకు సముద్రుఁడు, అగుశౌరి=విష్ణువు, వారిచరమున్ = నీటియందు వసించుమొసలిని, ఖండింపఁగాన్ = త్రుంచు

టకై, సత్వరిత....క్రమున్ - సత్వరిత = వేగముతోఁ గూడినదిగనుకనే, అరంపిత = అవరునట్లుచేయఁబడిన, భూమిచక్రమున్ = భూమండలముగలదియు, మహో....శుక్రమున్—మహత్+ఉద్యత్=గొప్పదిగాఁబుట్టుచున్న, విస్ఫులింగ=మిణుఁగురులయొక్క, ఛటా=గుంపుచేత, పరిభూత=తిరస్కరింపఁబడిన, అంబర = ఆకసమునందలి, శుక్రమున్ = చుక్కగలదియు, బహు....నిర్వక్రమున్-బహువిధ = పలుతెఱఁగులయిన, బ్రహ్మాండభాండ = బ్రహ్మాండము లనెడుకుండలయొక్క, ఛటా = గుంపులయొక్క, అంతర = సందులందు, నిర్వక్రమున్ = ఆటంకములేనిదియు, పాలితా....చక్రమున్-పాలిత = కాపాడబడిన, సుధాంధః = అమృతమే యాహారముగఁ గల వేల్పులయొక్క, చక్రమున్ = సమూహముగలదియునయిన, చక్రమున్= సుదర్శనమును, పంపెను = ప్రయోగించెను.

తా. నొచ్చినవారి కష్టములఁజూచి యోర్వలేనంత దయాళువగు విష్ణువు ఆ మకరమును ఖండింపఁగోరి, వేగముగాఁబోవునదిగాన భూమండలంబునంతయుఁ గదలించునదియు, సూర్యునికంటె నెక్కువ వెలుతురుగల మిణుఁగురులను రాల్చునదియు, పదునాలుగు లోకంబులతోఁగూడిన బ్రహ్మాండమునం దడ్డములేక యంతటవ్యాపించునదియు, వేల్పుల నందఱిని వారిశత్రువులనుండి కాపాడునదియు నైనచక్రాయుధమును బంపెను.

వ. అట్లు పంచిన, 94

తా. ఆప్రకారము విష్ణువు చక్రాయుధమును బ్రయోగింపఁగా,

శా. అంభోజాకర మధ్యనూతన నళిన్యాలింగనక్రీడనా,
రంభుండైన వెలుంగుఱేని చెలువారన్వచ్చినీటన్గభు,
గ్గుంభద్ధ్వానముతోఁ గొలంకువు కలంకుంబొందఁగాఁ
జొచ్చిదు, ష్టాంభోవర్తి వసించుచక్కటికి డాసీయంబోయి
హృద్వేగమై. 95

టీ. అంబోజ ..రంభుండు-అంభోజ+ఆకర= తామరకొలనియొక్క- మధ్య=నడుమ,నూతన = క్రొత్త,నళిని = తామరతీగయొక్క, (నళినియని స్త్రీలింగసారస్యముచే నొకస్త్రీయొక్క అని ద్యోతనమగుచున్నవి.) ఆలింగన = కౌఁగిలించుకొనుట, క్రీడన = జలవిహారముచేయుట యను నీరెంటి యందును, ఆరంభుండు = తలంపుగలవాఁడు, అయిన, వెలుంగుతేనిచెలువు + అరన్=సూర్యుఁడో యనునట్లు, (తేనియను పదసారస్యమువలన నొక రాజనియు ద్యోతనముగలుగుచున్నది ) వచ్చి, నీటన్ = నీటియందు, గుభుల్ గుంభద్ధ్వానముతోన్=గుభుల్లని శబ్దించు ధ్వనితోఁగూడి, కొలంకువు =కొలను, కలంకున్+పొందఁగాన్=కలఁతచెందునట్లు,చొచ్చి = (లోపల) ప్రవేశించి, దుష్ట+అంభోవర్తి = దుష్టమయిన జలచరము, (మొసలి)వసించు చక్కటికిన్ = ఉండునట్టి ప్రదేశమునకు, డాయన్+పోయి = దాపునకుఁ బోయి, హృద్వేగము+ఐ = మనోవేగంబునుంబోలు వేగముగలదై,

తా. అట్లు విష్ణువు చక్రంబు ప్రయోగించిన వెంటనే, తామరకొలని యందుండు నళిని యనుస్త్రీని గౌఁగిలించుకొని జలక్రీడలసల్పుటకై యేతెంచిన వేఁడివెలుఁగుగలసూర్యుఁడనెడు పురుషుండో యనఁ వినిగినట్లుగా నానుదర్శనము గుభుల్గుభుల్లనెడిధ్వనులతోఁ గూడివచ్చి యాకొలనంతయు గ్రుంగునట్లు లోపలికిఁజొచ్చి యాగ్రాహము మకరం బున్నచోటికిఁ బోయి మనోవేగంబుఁ బోలువేగముగలదై.

శా. భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్ర మాశు
క్రియన్, హేమక్ష్మాధరదేహమున్ జకితవన్యేభేంద్రసం
దోహమున్, గామక్రోధనగేహమున్ గరటిరక్తస్రావ
గాహంబు ని, ర్మోహోత్సాహము వీతదాహము జయశ్రీ
మోహమున్ గ్రాహమున్. 98

టీ. చక్రము=సుదర్శనము, హేమక్ష్మాధరదేహమున్ = బంగారు కొండవంటి దేహముగలదియు, చకిత...హమున్ - చకిత = జడిపింపఁబడిన, వన్య = అడవియందుఁబుట్టిన, ఇభ + ఇంద్ర = మేటియేనుఁగుల యొక్క, సందోహమున్ = గుంపుగలదియు, కామక్రోధనగేహమున్ = కామమునకును క్రోధమునకును నునికిపట్టును, కరటిరక్తస్రావగాహంబు - కరటి=ఏనుగుయొక్క, రక్త=నెత్తుటియొక్క, స్రావ=ప్రవాహమునందు, గాహంబున్ = స్నానము చేయుటగలదియు, నిస్సీమ + ఉత్సాహమున్ = సాటిలేని పూనికిగలదియు, వీతదాహమున్ = పోయినదప్పిగలదియు, (దప్పిలేనిదియు) జయశ్రీ మోహమున్ = జయలక్ష్మిని పొందుటయందు మోహముపట్టుపల గలదియునైన, గ్రాహమున్ = మొసలిని, భీమంబై = వెఱపించునదై, తలన్ త్రుంచి=శిరంబు ఛేదించి, ఆశుక్రియన్=వేగముతో, ప్రాణములన్ పాపెన్ = ప్రాణములఁ బోగొట్టెను.

తా. సుదర్శనంబు కడుదాపునఁజేరి మఱింత వేగముతో మేరుపర్వతంబుఁబోలు దేహముగలదియు, అడవిలోని యేనుఁగులనన్నిటిని జడిపించునదియు, ఎక్కువగు కామక్రోధములు గలదియు, ఏనుఁగుయొక్క రక్తప్రవాహమున మునిఁగినదియు, దప్పిలేక తగ్గక యింకను బోరాడవలయునని యుండునదియును, ఎట్లయిన నేనుఁగును జయించి జయలక్ష్మిం బొందుట యందుఁ బట్టుపలగలదియునై యున్న యా మొసలియొక్క శిరంబును ద్రుంచి దానిని సంహరించెను.

వ. ఇట్లు నిమిషస్పర్శంబున సుదర్శనంబు మకరితలఁ ద్రుంచు నవసరంబున, 97

తా. ఇట్లు ఒకతాఁకుడుతోనె సుదర్శనం బనుచక్రము మకరియొక్క శిరంబును ఛేదించుసమయమందు,

క. మకర మొకటి రవిఁ జొచ్చెను
మకరము మఱియొకటి ధనదుమాటున డాఁగెన్
మకరాలయమునఁ దిరిగెడు
మకరంబులు కూర్మరాజు మఱువునఁ బరిగెన్. 98

టీ. మకరము + ఒకటి = మకరమనురాశి, రవిన్ = సూర్యుని, చొచ్చెను = ప్రవేశించెను, మకరము మఱియొకటి = మకరమనునిధి యని భావము, ధనదు మాటునన్ = కుబేరుని మఱుఁగున, డాఁగెన్ = డాఁగెను, మకర + ఆలయమునన్ = మొసళ్లకునికిపట్టయిన యాకొలనియందు, తిరిగెడు = సంచరించునట్టి, మకరంబులు = మొసళ్లు, కూర్మరాజుమఱువునకున్ = ఆదికూర్మముయొక్కచాటునకు, పరిగెన్ = పోయెను.

తా. సుదర్శనము మకరమును జంపఁగానే యొకమకరము రాశిచక్రమునఁ బోయి చేరెను. మఱియొకమకరము కుబేరునినిధిగ్రహముఁ బోయి చేరెను. ఆకొలనిలోనున్న తక్కిన మకరములన్నియు ఆదికూర్మావతార మెత్తిన విష్ణుదేవుని మఱుఁగునఁ జేరెను. సూర్య, కుబేర, కూర్మములకడకుండు మకరంబు లీకొలనినుండి పోయిన మకరంబులు గాఁ బోయినవను, అవి యివియె యనుటచే నతిశయోక్త్యలంకారము. అయ్యతిశయోక్తికి హేతువు శ్లేషగల మకరశబ్దముగావున నాయతిశయోక్తికి శ్లేష యంగము.

మ. తమముం బాసినరోహిణీవిభుక్రియన్ దర్పించి సంసార
చక్రము వీడ్కొన్న విరక్తచిత్తునిగతిన్ గ్రాహంబు
పట్టూడ్చి పాదము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సంభ్రమదాశాకరిణీకరోజ్ఝితసుధాంభఃస్నానవిశ్రాంతుఁడై. 99

టీ. తమమున్ పాసిన=రాహువునుండి విడువఁబడిన, రోహిణీవిభుక్రియన్ = రోహిణికి భర్తయగు చంద్రునివలె, దర్పించి = మదించి, పొగరొంది, సంసారచక్రము = సంసారమనెడుచక్రమును, వీడ్కొన్న=సెలవు పుచ్చుకొన్న, విడిచిపెట్టిన, విరక్తచిత్తునిగతిన్ = వైరాగ్యవంతునివలె, వడి, గ్రాహంబు పట్టు+ఊడ్చి = మొసలి పట్టుకొన్నపట్టును వదలించికొని, పాదములు+అల్లార్చి=కాళ్లు జాడించి, కరేణుకావిభుఁడు = గజేంద్రుఁడు సంభ్రమ...క్రాంతుఁడు+ఐ - సంభ్రమత్=త్వరపడుచున్న, ఆశాకరిణీ=దిగ్గజముల భార్యలయొక్క, కర=తొండములచేత, ఉజ్ఝిత=విడువఁబడిన, సుధా+అంభః = అమృతమునందు, స్నాన = జలకమాడుటచే, విశ్రాంతుఁడై = అలసటఁ దీర్చుకొన్నవాఁడయి, సౌందర్యముతో=అందముతో, ఒప్పెన్ = ప్రకాశించెను.

తా. రాహువుచే మ్రింగఁబడి, మరల విడువఁబడిన చంద్రునివలెను, సంసారమునఁ ద్రిప్పటలుబడి రోసి, సంసారమును విడిచినవిరాగివలెను, నా గజేంద్ర మా మొసలియొక్క పట్టునుండి తప్పించుకొని, కాళ్లు విదిలించి దిగ్గజేంద్రములరాణులు తమతొండముతోఁ జల్లిన నీటియందుఁ దడియుటచే నలసట దీర్చుకొన్నదై మిక్కిలి యందముగలిగియుండెను.

శా. పూరించెన్ హరి పాంచజన్యము సుధాంభోరాశిసౌజన్యము
న్భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యమున్
సారోదారసితప్రభాచకిత పర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్.

టీ. హరి=విష్ణువు, సుధా....జన్యమున్-సుధాంభోరాశి=పాలకడలియందు, సౌజన్యమున్=పుట్టుకగలదియు, భూరి...న్యమున్-భూరి=గొప్ప, ధ్వాన=రొదచేత, చల+అచలీకృత=ఊగింపఁబడిన, మహాభూత = గొప్ప భూతములయొక్క, ప్రచైతన్యమున్ = బుద్ధిగలదియు, సార = బలిమిచేత,

ఉదార=గొప్పదైన, సిత=తెల్లనైన, ప్రభా=కాంతిచేత, చకిత = ఉలికింపఁ బడిన, పర్జన్యాదిరాజన్యమున్ = ఇంద్రుఁడు మొదలగురాజశ్రేష్ఠుల గుంపు గలదియు, దూరీభూత.... దైన్యమును–దూరీభూత=పాఱిపోయిన, విపన్న= నొచ్చినవారియొక్క, దైన్యమును=దుఃఖముగలదియు, నిర్ధూత = ఎగురఁ గొట్టఁబడిన, ద్విషత్=శత్రువులయొక్క, సైన్యమున్ = సేనలుగలదియు నైన, పాంచజన్యమున్=శంఖమును, పూరించెన్ = ఊఁదెను.

తా. విష్ణుమూర్తి యప్పుడు పాల్కడలియందుఁ బుట్టినదియు, తన గొప్పధ్వనిచే గొప్పభూతములనన్నిఁటినిఁ గదలించునదియుఁ, దెల్లనైన గొప్పకాంతిచే నింద్రాదులగు వేల్పులనుగూడ వెఱపించునదియు, భక్తుల యాపదలఁ దీర్చునదియు, శత్రువులసేనలను దిక్కుదిక్కులకుఁ దఱుమఁ గొట్టునదియు నైనపాంచజన్యము నూఁదెను.

మ. మొరసె న్నిర్జరదుందుభుల్ జలరుహామోదంబులై
వాయువుల్, దిరిగెంబువ్వులవానజల్లుగురిసెన్ దేవాంగనా
లాస్యముల్, పరఁగెన్ దిక్కులఁబిక్కటిల్లి జయశబ్ద
ధ్వానముల్ నిండె సాగర మువ్పొంగెఁ దరంగ
చుంబితనభోగంగాముఖాంభోజమై. 101

టీ. నిర్జరదుందుభుల్=దేవతల నగారాలు, మొరసెన్ = శబ్దించెను, వాయువుల్, జలరుహామోదంబులై = కమలములవాసనగలవై, తిరిగెన్ = వీచెను, పువ్వులవానజల్లు=పుష్పవర్షముయొక్కజడివాన, కురిసెన్, దేవాంగనాలాస్యముల్ = అప్సరసలయొక్క ఆటలు, పరఁగెన్=జరిగెను, జయ బ్దధ్వానముల్=జయజయయను పదమునుజెప్పునప్పుడు గలుగురొదలు, దిక్కులన్=దెసలందు, పిక్కటిల్లి = ఒఱసుకొని, నిండించెను, సాగరము = సముద్రము, తరంగ...భోజము+ఐ–తరంగ = అలలచేత, చుంబిత=తాఁకఁ బడిన - ముద్దుపెట్టుకొనఁబడిన, నభోగంగా = ఆకాశగంగానదియొక్క

ఒకస్త్రీయొక్క, ముఖ+అంభోజము+ఐ=కమలమువంటి మోముగలదై మోమైన కమలములుగలదై, ఉప్పొంగెను.

తా. శ్రీమహావిష్ణువు శంఖము పూరించునప్పుడు దేవతల నగారాలు మ్రోఁగినవి. మందమారుతములు తామరపూవులవాసనలతోఁగూడి వీచెను. పుష్పవర్షములు ముసరుపట్టి కురిసెను. అప్సరసలు వేడ్కతో నాట్యము లాడిరి. ఏవైపునను జయజయధ్వనులు మ్రోఁగెను. సముద్రుఁడగు పురుషుఁడు, తనయలలనెడు చేతులతో నాకాశగంగయనెడి వనితయొక్క ముఖకమలమును ముద్దిడఁగోరెనో యన్నట్లు సముద్రము మిన్నుమిట్టు నంత పైకిపోయిన యలలుగలదై యుప్పొంగెను.

ఈపద్యమున "సాగరము....జమై" అనువాక్యమున సాగరము మిన్నుముట్టకపోయినను ముట్టినదని చెప్పుటచే నతిశయోక్త్యలంకారము.

క. నిడుదయగుకేల గజమును
మడుపున వెడలంగఁ దిగిచి మదజలరేఖల్
దుడుచుచు మెల్లనఁ బుడుకుచు
నుడిపెను విష్ణుండు దుఃఖ ముర్వీనాథా. 102

టీ. ఉర్వీనాథా=ఓపరీక్షిన్మహారాజా! విష్ణుండు,నిడుద+అగుకేలన్=తనపొడవుచేతితో, గజమును=ఏనుఁగును, మడువునన్+వెడలన్+కన్+తిగిచి=మడువునుండి వెలుపలికీడ్చి, మదజలరేఖల్ = మదోదకధారలను, తుడుచుచున్, మెల్లనన్ = తిన్నఁగా, పుడుకుచున్ = తడవుచు, దుఃఖము ఉడిపెను=పోఁగొట్టెను.

తా. పరీక్షిన్మహారాజా! విష్ణువు తన నిడుపుచేతితో నాయేనుఁగుల రేనిని మడువునుండి వెలుపలికీడ్చి దానిమదజలధారలను దుడిచి, వీఁపు నిమిరి, దానిభయంబును దొలఁగించెను.

క. శ్రీహరికరసంస్పర్శను
దేహము దాహంబు మాని ధృతిఁ గరిణీసం
దోహము దానును గజపతి
మోహనఘీంకారశబ్దములతో నొప్పెన్. 103

టీ. శ్రీహరికరసంస్పర్శను = లక్ష్మీదేవితోఁ గూడినవిష్ణువుయొక్క చేతితోఁ దడవుటవలన, గజపతి = గజేంద్రము, దేహముదాహంబు మాని = శరీరముయొక్కయలసటను బోకార్చి, ధృతిన్ = సంతోషముతో, కరిణీ సందోహమున్ = ఆఁడేనుఁగుల గుంపును, తానును, మోహనఘీంకార శబ్దములతోన్ = ఒరులను మైమఱపించు ఘీంకారధ్వనులతో, ఒప్పెన్ = ప్రకాశించెను.

తా. అట్లు విష్ణువు గజరాజుభయంబుఁ దాపఁగానే, వెంటనే యాగజేంద్రము దేహము బడలిక విడిచి పెంటియేనుఁగులతోఁ గూడి యెక్కువ మక్కువతో వినువారి చెవులకు రసాయనమగు ఘీంకారము చేసెను.

క. కరముల మెల్లన నివురుచుఁ
గర మనురాగమున మెలసి కలయంబడుచున్
గరి హరికతమున బ్రదికినఁ
గరపీడన మాచరించెఁ గరిణులు మఱలన్. 104

టీ. కరి = గజేంద్రుఁడు హరికతమునన్ = శ్రీవిష్ణువుయొక్కదయ వలన, బ్రదికినన్ = జీవింపఁగా, మఱలన్ = తిరుగ, కరిణులు = ఆఁడేనుఁగులు, కరములన్ = తొండములతో, మెల్లనన్ = తిన్నఁగా, నివురుచున్ = తడవుచు, కరము = మిక్కిలి, అనురాగమునన్ = మోహముతో, మెలసి = కూడి, కలయంబడుచున్ = చేరుచు, కరపీడనము + ఆచరించెన్ = తొండములతోఁ దొండములను బెనఁచుకొనెను.

తా. గజేంద్రుఁడు విష్ణువుదయచే బ్రతికిరాఁగా, పెంటియేనుఁగు లన్నియు మహానురాగముగలవై దానిం జుట్టుకొని, తమతొండముతోఁ దొండములను బెనఁచుకొనెను.

సీ. జననాథ దేవలశాపవిముక్తుఁడై
పటుతరగ్రాహరూపంబు మాని
ఘనుఁడు *హూహూనామకగంధర్వుఁ డప్పుడు
తనతొంటి నిర్మలతనువుఁ దాల్చి
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి
తవిలి కీర్తించి గీతములు పాడి
యాదేవుకృపనొంది యందంద మఱియును
వినతశిరస్కుఁడై వేడ్కతోడ
ఆ. దళితపాపుఁ డగుచుఁ దనలోకమున కేఁగె
నపుడు శౌరి కేలనంటి తడవ
హస్తిలోకనాథుఁ డజ్ఞానరహితుఁడై
విష్ణురూపుఁ డగుచు వెలుఁగుచుండె. 105

* హూహూవు—ఇతఁ డొకగంధర్వుఁడు. ఇతఁడొకనాఁడు తన ప్రియురాండ్రతోఁగూడి మాలినీనదియందు జలక్రీడలను సల్పుచుండఁగా. నచ్చటికి దేవలుఁడను మునీంద్రుఁడు స్నానార్థమై యేతెంచెను. ఆయన వచ్చుట తమజలక్రీడలకు విఘ్నముగా నున్నదని యెంచి, యాహూహూవు నీటిలోపల నేపోయి యమ్మునీంద్రుని కాలుపట్టి యీడ్చెను. దానికమ్మునీంద్రుఁడలిగి నీవు మకరివౌదువుగాక యని శపించెను. అంత హూహూవు తన్ను మన్నింప వేఁడఁ, గొన్నియేండ్లకు బిదప శ్రీవిష్ణువువలన శాపవిమోచనంబు గాఁగలదని చెప్పిపోయెను. ఇదియే హూహూవు మకరరూపంబుఁ దాల్చుటకుఁ గారణ మయ్యెను.

టీ. జననాథ=ఓపుడమిఱేఁడా! ఘనుఁడు=గొప్పవాఁడగు, హూహూ నామ గంధర్వుఁడు = హూహూవు అను పేరుగల గంధర్వుఁడు, దేవలశాపవిముక్తుఁడై = దేవలమహర్షి యొసఁగినశాపముచే విడువబడినవాఁడై, పటు...రూపంబు - పటుతర = మిక్కిలి బలిమిగల, గ్రాహరూపంబు= మొసలిరూపమును, మాని=విడిచి, తనలోఁటినిర్మలతనువున్=లపసముందటి పవిత్రమయిన తనువును, తాల్చి=ధరించి, అవ్యయుఁసరుస్ = భేదములేనివాఁడగు, హరికిన్ = విష్ణువునకు, అతిభక్తితోన్ =మిక్కిలిప్రేమతో, మ్రొక్కి, తవిలి = భగవంతునియందు మనసుపెట్టి, కీర్తించి = కొనియాడి, గీతములు = కీర్తనలు, పాడి, ఆ దేవుకృపన్ = ఆభగవంతుని కటాక్షమును, ఒంది, అందందున్ + అ=అచ్చటచ్చటనే, మిఁగియుసు=మిక్కిలి, వేడ్కతోడన్ = ఉత్సాహముతో, వినతిశిరస్కుఁడై = తలవంచి నమస్కారము చేయువాఁడయి, దళితపాపుఁడు + అగుచున్ = పాపములచే విడువఁబడిన వాఁడగుచు, తనలోకమునకున్ = తనవగుగంధర్వలోకంబునకు, ఏఁగెను, అప్పుడు, శౌరి = విష్ణువు, కేలన్ = చేతితో, అంటి=తాఁకి, తడవన్ = చమ అఁగా, హస్తిలోకనాథుఁడు = గజసమూహములకు ఱేఁడు, అజ్ఞానరహితుఁడు + అగుచున్ = అజ్ఞానముచే విడువఁబడినవాఁడగుచు, విష్ణురూపుఁడు + అగుచున్=మహావిష్ణురూపంబును దాల్చినవాఁడయి, వెలుఁగుచుండెన్= ప్రకాశించుచుండెను.

తా. ఓపరీక్షిన్మహారాజా! తొల్లి దేవలశాపముచే మొసలిరూపంబుఁ దాల్చియుండిన హూహూ వను నొకగంధర్వుఁడు దేవలమహర్షి శాపంబుచే ముక్తుఁడై, తనయొక్క పాపరహితమైన నిర్మలరూపంబుఁదాల్చి, నాశరహితుఁడగు నాభగవంతునికి మిక్కిలి యెక్కువయినభక్తితో మ్రొక్కి, పట్టు దలతో నతనిని బాగుగాఁ గొనియాడి, భగవన్నామసంకీర్తనముఁ జేయుచు నుండి, తనపాపంబులనెల్లఁ బోఁగొట్టుకొని తనవగు గంధర్వలోకంబున కేఁగెను. అప్పుడు గజరాజును విష్ణుమూర్తి తనచేతితోఁదాకి తడవుటచేఁ దన యవిద్యాసంబంధమును బాసి, విష్ణురూపియై వెలుఁగుచుండెను.

మ. అవనీనాథ గజేంద్రుఁడై మకరితోఁ నాలంబు గావించె
మున్, ద్రవిడాధీశుఁడతండు పుణ్యతముఁడింద్రద్యుమ్న
నాముండు వైష్ణవముఖ్యుండు గృహీతమౌననియతిన్
సర్వాత్ము నారాయణున్; సవిశేషంబుగఁ బూజసేసెను
మహాశైలాగ్రభాగంబునన్. 106

టీ. అవనీనాథ=ఓ పరీక్షిన్మహారాజా! గజేంద్రుఁడై = గజరాజయి, మకరితోన్ = మొసలితో, ఆలంబు=పోరు, కావించెన్ = ఎవఁడు చేసెనో, అతఁడు, మును=మునుపు, పూర్వజన్మమున, ద్రవిడాధీశుఁడు=ద్రవిడదేశము నేలిక, పుణ్యతముఁడు = మిక్కిలి పరిశుద్ధుఁడయినవాఁడు, ఇంద్రద్యుమ్న నాముఁడు = ఇంద్రద్యుమ్నుఁడను పేరుగలవాఁడు, వైష్ణవముఖ్యుఁడు = విష్ణుభక్తులలో మేటి, అతఁడు, గృహీతమౌననియతిన్ = అవలంబించిన మౌనమను విధితో, సర్వాత్మున్ = ప్రపంచమే స్వరూపముగాఁ గల వాఁడగు, నారాయణున్ = విష్ణుమూర్తిని, మహాశైలాగ్రభాగంబునన్ = గొప్ప కొండయొక్క కొనమీఁద, సవిశేషంబుగాన్ = లెస్సగా, పూజ చేసెను = అర్చనచేసెను.

తా. ఓ పరీక్షిన్మహారాజా! మకరముతోఁ బోరుసల్పిన గజరాజు సంగతిఁ దెలిపెద నాలకింపుము. అతఁడు ద్రవిడదేశరాజగు పుణ్యాత్ముఁడయిన ఇంద్రద్యుమ్నుఁడనురాజు. విష్ణుభక్తులలో మేటియైనవాఁడు. అతఁ డొక కొండకొనమీఁదఁ గూర్చుండి మౌనవ్రతంబుపూని సర్వేశ్వరుఁడగు నారాయణమూర్తికిఁ బూజ లొనరించుచుండెను.

మ. ఒకనాఁ డానృపుఁ డచ్యుతు న్మనములోఁ నూహించుచు
న్మౌనియై, యకలంకస్థితి నున్నచోఁ గలశజుం డచ్చో
టికిన్వచ్చి లేవక పూజింపకయున్న మౌనిఁ గని వశ్య

క్రోధుఁడై మూఢ లుబ్ధ కరీంద్రోత్తమయోనిఁ బుట్టు
మని శాపంబిచ్చె భూవల్లభా. 107

టీ. భూవల్లభా = ఓ పుడమిఱేఁడా! అన్యస్పృహ = ఆశాజు, అచ్యు తున్=విష్ణువును, మనమునన్=మనసునందు, ఊహించుచున్ = చింతించుచు, మౌనియై=మౌనవ్రతముగలవాఁడై, అకలంకస్థితిన్ = నిర్వికారస్థితియందు, ఉన్నచోన్=ఉన్నప్పుడు, కలశజుండు=అగస్త్యమహాముని, అచ్చోటికిన్= ఆతావునకు వచ్చి, లేవక, పూజింపక = పూజసేయక, ఉన్నమౌనిన్=ఉన్న మౌనవ్రతుండయిన యాయింద్రద్యుమ్నుని, కని, నవ్యక్రోధుఁడై=రేఁగిన కోపముగలవాఁడై, మూఢ = తెలివిలేనివాఁడా! లుబ్ధ = పేరాసగలవాఁడా! కరీంద్ర + ఉత్తమయోనిన్ = ఏనుఁగుల మేటియొక్క వంశమున, పుట్టుము, అని, శాపంబు ఇచ్చెను = శాప మొసఁగెను.

తా. ఓపరీక్షిన్మహారాజా! ఒకదినమున నాయింద్రద్యుమ్నమహా రాజు భగవంతుని మనస్సులో ధ్యానించుచు మౌనము వహించి నిశ్చలస్థితి యందుండఁగా అగస్త్యమహాముని యచ్చేరువకు వచ్చెను. అప్పు డింద్ర ద్యుమ్నుఁడు తాను సమాధిలో నున్నందున నమ్మునీంద్రుఁ జూచి లేచి నిలువక యతిథిసత్కారంబు చేయకయుండెను. అంత నగస్త్యుఁ డలిగి, మూఢుఁడా! లుబ్ధుఁడా! నీవు మదించి నన్నవమానపఱిచితివిగావున గజేంద్ర వంశమునఁ బుట్టుదువుగాక యని యాయింద్రద్యుమ్నమహారాజునకు శాపం బిచ్చెను.

క. మునిపతి నవమానించిన
యాయిం ద్రద్యుమ్నవిభుఁడు కౌంజరయోనిన్
జననం బందెను విప్రులఁ
ఘనుల నవమానింపఁ దగదు ఘనపుణ్యులకున్. 108

టీ. మునిపతిన్ = మునులలో శ్రేష్ఠుఁడైన యగస్త్యుని, అవమా నించిన ఘనుఁడు = అమర్యాదచేసిన గొప్పవాఁడు, అగు, ఇంద్రద్యుమ్న విభుఁడు=ఆపేరుగలరాజు, కౌంజరయోనిన్-కౌంజర=ఏనుఁగుసంబంధమైన, యోనిన్ = జాతియందు, జననంబు + అందెను = పుట్టెను, విప్రులన్ = బ్రాహ్మణులను, కని, ఘనపుణ్యులకున్ = ఎక్కువపుణ్యము చేసినవారికి అవమానింపన్ = మన్ననసేయకుండుట, తగదు = యోగ్యముకాదు.

తా. అగస్త్యుని నవమానపఱచిన గొప్పవాఁడగు నింద్రద్యుమ్నుఁడను రాజు గజజాతియందుఁ బుట్టెను. కావున నెల్లప్పుడు బుద్ధిమంతులయినను పుణ్యశాలులయినను బ్రాహ్మణుల నవమానించినఁ జేటువాటిల్లునని యెఱుఁగ వలయు.

క. కరినాథుఁ డయ్యె నాతఁడు
 కరులైరి భటాదు లెల్ల ; గజముగ నయ్యున్
 హరిచరణ సేవకతమునఁ
 గరివరునకు నధికముక్తి ; గలిగె నరేంద్రా! 109

టీ. అతఁడు=అయింద్రద్యుమ్ననృపాలుఁడు,కరినాథుఁడు=గజరాజు, అయ్యెను, భట+ఆదులు + ఎల్లన్=అరాజుబంటులందఱును, కరులు+ఐరి= తక్కిన యేనుఁగులుగా జన్మించిరి, నరేంద్రా = పరీక్షిన్మహారాజా! గజ ముగ నయ్యున్ = ఏనుఁగైయుండియు, హరిచరణసేవకతమునన్ = విష్ణుపాదములకు సేవచేయుటచేత, కరివరునకున్ = ఏనుఁగులరాయనికి, అధికముక్తి = ఎక్కువ మోక్షము, కలిగెన్ = సాయుజ్యము గలిగెను.

తా. ఓనృపాలా! ఆ యింద్రద్యుమ్నుఁడు ఈకొలవియందు [illegible]తో బోట్లాడిన గజముగాను, తక్కిన యాతనిబంటు లీగజేంద్రునితోఁ [illegible]దురగుచుండు గజములుగాను బుట్టిరి, ఆయింద్రద్యుమ్నుఁడు

గజేంద్రుఁడయ్యును, విష్ణుమూర్తియొక్క పాదారవిందములను గొల్చుటచే నతనికి శాశ్వతమగు మోక్షము గలిగెను.

ఆ. కర్మతంత్రుఁడగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు
నుభయనియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లనఁ
బ్రబలమైన విష్ణుభక్తి చెడదు. 110

టీ. కర్మతంత్రుఁడు+అగుచున్=వాని వానికులాచారవిహితకర్మలకు లోఁబడినవాఁడై వానినిఁజేయుచు, కమలాక్షున్ = విష్ణువును, కొల్చుచున్ = భజనసేయుచు, ఉభయ....వృత్తిన్-ఉభయ = పైరెంటియందును, నియత వృత్తిన్=కదలని నిలుకడతో, ఉండెనేని = ఉండినయెడల, కర్మము + ఎల్లన్ = వానిపురాకృతపుణ్యపాపరూపంబగు కర్మలన్నియు, మెల్లనన్= తిన్నఁగా, శిథిలమై=క్షీణించి, చెడును=పోవును, ప్రబలము+ఐనవిష్ణుభక్తి= భగవంతునియం దెడఁబాయనిభక్తి, చెడదు = నశించదు.

తా. నరుఁడు సాంసారికధర్మములలో నున్నను, తీరినప్పుడు భగవంతునిఁ గొల్చుచుఁ దప్పక రెంటిని మఱువక యెల్లప్పుడు సమముగాఁ బ్రవర్తింపుచుండెనేని, వానికర్మలు నానాఁట క్షీణించును గాన స్థిరమగు విష్ణుభక్తి యెన్నటికినిఁజెడదు. "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అనఁగా కోటిజన్మములకుఁ బిదపనైన జ్ఞానవంతుఁడు తన్నుఁ జెందఁగలఁడు. అని భగవద్గీతావాక్యానుసారంబుగా భగవంతునిఁ గొల్చుచో నొక్కజన్మమున ఫలదాయకము గాకపోయినను, మఱియొక జన్మముననైనను ఫలంబొసఁగును గావున గజేంద్రుఁడు పూర్వజన్మమున ముక్తినొందక, ముందుజన్మమునకంటె హీనమయిన మృగజాతియందుఁ బుట్టినను ఈజన్మమునఁ బూర్వజన్మవాసనావిశేషమున ముక్తినిఁ బొందెను.

క. చెడుఁ గరులు హరులు ధనములు
చెడుదురు నిజసతులు సుతులు ◌ెచెడుచెనఁటులకుఁ
జెడక మను నెఱసుగుణులకుఁ
జెడనిపదార్థములు విష్ణుసేవానిరతుల్. 111

టీ. చెడుచెనఁటులకున్ = ఎల్లప్పుడు భగవద్ధ్యానము లేకయుండు మానవులకు, కరులు = ఏనుఁగులు, హరులు = గుఱ్ఱములు, ధనములు = కలుములు, చెడును = నశించును, నిజసతులు = తమభార్యలు, సుతులు = కొడుకులును, చెడుదురు = నశింతురు, నెఱసుగుణులకున్ = సుగుణములతో నిండినవారికి, చెడక, (పైఁజెప్పిన ధనములు, వాహనాదులు, భార్యాపుత్త్రాదులు) మనున్ = జీవించును, జీవింతురు, విష్ణుసేవానిరతుల్ = భగవంతునియొక్క సేవచేయుటయందే యాసక్తిఁగలవారు, చెడనిపదార్థములు = నశింపనివస్తువులు.

తా. నిత్యానిత్యవస్తువివేకములేనిమూఢులు భగవంతునియందుఁ గించిత్తైనను మనంబుంచక, సదా సంసారచక్రమందుఁ దిరుగుచు,తనచుట్టు నున్నపశువాహనాదులు, ధనధాన్యాదులు, పుత్త్రమిత్త్రకళత్త్రబాంధవాదులు శాశ్వతంబు లని నమ్మియుందురు. అవి యెన్నటికిని స్థిరంబులుగావు. ఎవరు సంసార ధర్మమునందున్నను ఫలాపేక్ష మాని భగవదర్పణబుద్ధితో సత్కార్యములనుజేయుచు, భగవంతుని విడువక ధ్యానము చేయుచుందురో, వారు ఇహమున పుత్రమిత్రకళత్రబాంధవపరివారాదిసమేతులయి ధనకనక వస్తువాహనాదిసమృద్ధి గలిగియుండి, కడపట శాశ్వతంబగు మోక్షపదంబు నొందుచున్నారు. (విష్ణుభక్తు లెప్పటికిని నుండుపదార్థములు, అనఁగా, వారికి జననమరణదుఃఖములు లేవని తాత్పర్యము.)

వ. అప్పుడు జగజ్జనకుం డగు నప్పరమేశ్వరుండు దర
హసితముఖకమల యగు నక్కమల కిట్లనియె. 112

టీ. అప్పుడు = గజేంద్రరక్షణమును, ఇంద్రద్యుమ్నుని శాపవిమోచనంబును జేసినపిదప, జగజ్జనకుండు = లోకములకుఁ గారణభూతుఁడు, అగు, ఆ సర్వేశ్వరుండు=అన్నిటికిఁ బ్రభువగు విష్ణుమూర్తి, దరహసిత ముఖకమల = చిఱునగవుతోఁగూడినకమలమువంటి మోముగలది, అగు, [illegible] = లక్ష్మీదేవినిఁ జూచి, ఇట్లనియె.

తా. సర్వలోకమునకు సృష్టికర్తయు, పోషకుండు నైనవిష్ణుమూర్తి తామరపువ్వువంటి మోముగల లక్ష్మీదేవిని జూచి యిట్లనెను.

క. బాలా నావెనువెంటను
హేల న్వినువీథినుండి ♦ యేతెంచుచు నీ
చేలాంచలంబుఁ బట్టుట
కాలో నేమంటి నన్ను ♦ నంభోజముఖీ. 113

టీ. అంభోజముఖీ = కమలమువంటి మోముగలదానా! నా వెనువెంటన్=నావెంబడి, హేలన్=వేడుకతో, వినువీథిన్+ఉండి = ఆకసంబునుండి, ఏతెంచుచున్ = వచ్చుచు, నీచేలాంచలంబున్ = నీపైఁటకొంగును, పట్టుటకున్ = పట్టుకొన్నందుకై, ఆలోన్ = ఆసమయంబున, ననున్, ఏమంటి = ఏమిచెప్పితివి.

తా. ఓకమలముఖీ! నీవు నావెంబడి వచ్చుచు నేను నీపైఁటకొంగు పీడ్చుకొనిపోయినందుకై యేమి తలంచితివి?

క. ఎఱుఁగుదుఁ దెలివా యెప్పుడు
మఱవను సకలంబు నన్ను ♦ మఱచినయెడలన్
మఱతు నని యెఱిఁగి మొఱఁగక
మఱవక మొఱ యిడిర యేని ♦ మఱియన్యములన్. 114

టీ. తెలవా = ఓప్రియకాంతా! ననున్ మఱచినయెడలన్ = నన్ను మఱచినపక్షమున, మఱతును = నేను అట్టివారిని మఱచిపోదును. అని మెఱంగి = అని తెలిసికొని, అన్యములన్ = ఇతరవిషయములందుఁదగులు గొనగి, మఱవక=నన్నుమఱచిపోక, మొఱఁగక=మోసపుచ్చక, మొఱయిడిరి +ఆ+ఏని = ఇడుములు వచ్చినప్పుడు నన్నుగూర్చి మొఱపెట్టుకొనిరేని, సకలంబు = అట్టివారి నందఱిని, (నేను) మఱవను = జ్ఞప్తియుంచుకొని యుందును, ఎప్పుడును = ఎల్లసమయంబులందును, ఎఱుంగుదును=వారిని రక్షించి వారియోగక్షేమంబును విచారించుకొనుచుందును.

తా. ఓ ప్రియురాలా ! నన్నుమఱచినయెడల నేనును వారిని మఱతు నని యెఱింగి, నన్నెల్లప్పుడు మఱవక భజింపుచు నాపదలందు నన్నుఁ గూర్చి మొఱయిడిరేని, యట్టివారిని నే నెల్లప్పుడు మఱవక వారియోగ క్షేమంబులను విచారింపుకొనుచుందును. వా రెన్నఁడు నాఁకు గ్రొత్తలేదు. అట్టివారి నందఱిని నే నెఱుంగుదును.

వ. అనిపలికిన నరవిందమందిరయగు నయ్యిందిరాదేవి చంద్రికాదరహాస సుందర వదనారవింద యగుచు ముకుందున కిట్లనియె. 115

టీ. అనిపలికినన్, అరవిందమందిర+అగు = కమలమే యునికి పట్టుగాఁ గలదియగు, ఆ యిందిరాదేవి = ఆ లక్ష్మీదేవి, చంద్రికా...విందఅగుచున్-చంద్రికా=వెన్నెలవంటి, దరహాస = చిఱునవ్వుచేత, సుందర= అందమైన, వదన + అరవింద అగుచున్ = కమలముంబోలుమోముగల దగుచు, ముకుందునకున్ = విష్ణుమూర్తికి, ఇట్లు, అనియెన్ = అనియెను.

తా. అట్లు విష్ణుమూర్తిపలికినపలుకు లాలకించి, కమలనివాసినియగు లక్ష్మీదేవి చిఱునవ్వు నవ్వుచు నిట్లనియె.

క. దేవా దేవరయడుగులు
భావంబున నిలిపి కొలుచుపని నాపనిగా
కోవల్లభ యేమనియెద
నీవెంటనే వచ్చుచుంటి నిఖిలాధిపతీ. 116

టీ. నిఖిలాధిపతీ = అన్నిఁటికి నేలికయగు ఓదేవా! దేవర యడుగులు = దేవరవారిపాదములు, భావంబునన్ = మనస్సునందు, నిలిపి. కొలుచు పని = ఉంచి సేవించుపని, నాపనిగాక=నాయొక్కకార్యముగాని. ఓవల్లభ = ఓప్రాణనాథా! ఏమి + అనియెదను = ఏమి చెప్పఁగలను, నీవెంటనే వచ్చుచుంటిని.

తా. సకలమునకు నేలికయైన యోదేవా! ప్రాణనాథా! తమదివ్య పాదారవిందములు నామనంబున నిల్పుకొని ధ్యానించుటకంటె నాకు వేఱేమి పనియున్నది? కాఁబట్టి మఱియేమియుఁ దలంపక తాము పోవునపుడు తమవెంబడె వచ్చుచుంటినిగాని యన్యంబేఁదలంపనైతిని.

క. దీనులకుయ్యాలింపను
దీనుల రక్షింప మేలుదీవనఁబొందన్
దీనావన నీ కొప్పును
దీనపరాధీన దేవదేవ మహేశా. 117

టీ. దీన+అవన=నొచ్చినవారినిఁగాపాడునట్టివాఁడా! దీనపరాధీన = ఆపన్నులగుభక్తులకు లొంగినవాఁడా! దేవదేవ = వేల్పులకెల్లఁ బెద్దయైన వాఁడా! మహేశా = ఓగొప్పప్రభువా! దీనులకుయ్యి = నొచ్చినవారిమొఱ లను, ఆలింపను = వినుటకును, దీనులన్ = నొచ్చినవారిని, రక్షింపన్ = కాపాడుటకును, మేలుదీవనన్ + పొందన్ = వారిపొగడ్తలను బొందుట కును, నీకున్, ఒప్పును = తగియున్నది.

తా. "నొచ్చినవారికిఁ బ్రాపవై, వారికి లోఁబడి కాపాడునట్టి దేవ దేవుఁడవయిన యోసర్వలోకప్రభూ! నీవొకఁడవ యాపన్నుల మొఱలను విని వారియాపదలను దొలఁగించి కాపాడుచు వారిచేఁ గొనియాడబడుదువు. నీవుతక్క నెవ్వరును రక్షకులు లేరు" అని లక్ష్మీదేవి విష్ణువును గొనియాడెను.

వ. అని మఱియును సముచితసంభాషణంబుల నంకించు
చున్న యప్పరమవైష్ణవీరత్నంబును సాదరసరససల్లాప
మందహాసపూర్వకంబుగా నాలింగనంబు గావించి
సపరివారుండై గరుడగంధర్వసిద్ధవిబుధగణజేగీయ
మానుండై గరుడారూఢుం డగుచు నిజసదనంబునకుం
జనియె నని చెప్పి శుకయోగీంద్రుం డిట్లనియె. 118

టీ. అనిమఱియును, సముచితసంభాషణంబులన్ = తగిన పలుకులతో, అంకించుచున్న=కొనియాడుచున్న, అప్పరమవైష్ణవీరత్నంబును = విష్ణుభక్తులలోఁ గడుశ్రేష్ఠురాలయిన యాలక్ష్మీదేవిని, సాదర....పూర్వకంబుగాన్ - సాదర = ఆదరముతోఁ గూడిన, సరస=ప్రేమగల, సల్లాప = ముచ్చటలును, మందహాస = చిఱునగవును, పూర్వకంబుగాన్=ముందుగాఁ గలిగినట్లుగా, ఆలింగనంబు కావించి = కౌఁగిలించుకొని, సపరివారుండై = భృత్యులతోఁ గూడినవాఁడై, గరుడ గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుండై = గరుడులయొక్కయు, గంధర్వులయొక్కయు, దేవతలయొక్కయు సమూహముచే మిక్కిలి పొగడబడుచున్నవాఁడై, గరుడ + ఆరూఢుండు + అగుచున్=గరుడవాహనమునెక్కిన వాఁడగుచు, నిజసదనంబునకు=తనపురంబునకు (వైకుంఠంబునకు) చనియెను, అని శుకయోగీంద్రుండు = యోగులలో శ్రేష్ఠుండయిన శుకమహాముని ఇట్లనియె,

తా. "లక్ష్మీదేవి ముందు చెప్పినమాటలేకాక యింక నెన్నియో తగుమాటలంబల్కి స్తోత్రముచేయుచుండఁగా నద్దేవదేవుం డవలోకించి, యాలక్ష్మితోఁ బ్రేమ వెల్లివిరియ ముచ్చటలాడుచుఁ జియసగజ్ఞ నప్పుడు నామెను గౌఁగిలించుకొని నారదుఁడు, విష్వక్సేనుఁడు మున్నగువారలు వెంబడివచ్చుచుండఁగా, గరుడగంధర్వసిద్ధచారణాదులు స్తోత్రములు సల్పుచుండఁగా, గరుడవాహనారూఢుఁడై వైకుంఠంబునకుఁ బోయెను" అని శుకమహాముసీంద్రుఁడు, పరీక్షిన్మహారాజుతోఁ జెప్పి మరల నిట్లుచెప్పెను.

సీ. నరనాథ నీకును ౕ నాచేత వివరింపఁ
బడిన యీ కృష్ణానుౕభావమైన
గజరాజమోక్షణౕకథ వినువారికి
యశము లెచ్చును గల్మౕషాపహంబు
దుస్స్వప్ననాశంబు ౕ దుఃఖసంహారంబు
ప్రొద్దున మేల్కాంచి ౕ పూతవృత్తి
నిత్యంబు పఠియించు ౕ నిర్మలాత్మకులైన
విప్రులకును బహుౕవిభవ మమరు
తే. సంపదలు గల్గుఁ బీడలు ౕ శాంతిఁ బొందు
సుఖము సిద్ధించు వర్ధిల్లు ౕ శోభనములు
మోక్ష మఱచేతిదై యుండు ౕ ముదము చేరు
ననుచు విష్ణుండు ప్రీతుఁడై ౕ యానతిచ్చె. 119

తా. "ఓపరీక్షిన్మహారాజా ! నీకునేను వినిపించినకృష్ణునిమహిమంబుఁ దెలిపెడి గజేంద్రమోక్షణకథవినువారికి నెక్కువకీర్తిగలుగును. ఈ గజేంద్రమోక్షకథ పాపంబులన్నింటినిఁబోఁగొట్టునది. ఈ కథ విన్నవారికిఁజెడుకలలు

రావు, వ్యసనంబులు సంభవింపవు. ప్రతిదినమునను వేకువజామునసే మేల్కొని, పరిశుద్ధమనస్సుతో నీ గజేంద్రమోక్షణంబు పఠించు ద్విజులకు సకలైశ్వర్యంబులు గలుగును. కలుము లొదఁగూడును. సకలరోగములు నివారణమగును. సౌఖ్యముగలుగును. మేలు పెంపొందును. వారికి మోక్షము అఱచేతిలోని ఉసిరికాయవలె సిద్ధమైయుండును. సంతోషములు గలుగును'' అని విష్ణుమూర్తి సంతోషపూర్వకముగా నానతిచ్చెను.

వ. అని మఱియు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె "నెవ్వరేనియు నపరరాత్రంబున మేల్కాంచి సమాహిత మనస్కులై శ్వేతద్వీపంబును, నాకుం బ్రియంబైన సుధాసాగరంబును, హేమనగంబును, అగ్గిరికందర కాననంబులను, వేత్ర కీచక వేణులతాగుల్మవృత పాదపంబులను, ఏనును, బ్రహ్మయు ఫాలలోచనుండు నివసించియుండు నక్కొండశిఖరంబులను, కౌమోదకీ సుదర్శనపాంచజన్యంబులను, శ్రీదేవిని, శేషగరుడ వాసుకి ప్రహ్లాద నారదులను, మత్స్య కూర్మ వరాహాద్యవతారంబులను, తదవతారకృతకార్యంబులను, సూర్యసోమపావకులను, ప్రణవంబును, నిర్మలతపస్సత్యంబులను, వేదంబులను, వేదాంగంబులను, శాస్త్రంబులను, గో భూసుర సాధు పతివ్రతాజనంబులను, చంద్రకశ్యపజాయాసముదయంబును, గౌరీ గంగా సరస్వతీ కాళిందీ సునందాప్రముఖ పుణ్యతరంగిణీ చయంబును, అమరులను, అమరతరువులను, ఐరా

వతంబును, అమృతంబును, ధ్రువునిని, బ్రహ్మర్షి
నివహంబును, బుణ్యశ్లోకులైన మానవేంద్రులను,
సమాహితచిత్తులై తలంచువారలకుఁ బ్రాణావసాన
కాలంబున మదీయంబగు విమలగతి నిత్తు నని హృషీ
కేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి విహగపరిబృఢ
వాహనుండై వేంచేసె విబుధానీకంబు సంతోషించె”
నని చెప్పి శుకుండు రాజున కిట్లనియె. 120

తా. మఱియు నా పరమేశ్వరుండయిన హృషీకేశుండు “వేకువ నెవ్వరు మేల్కాని కడంగి మనస్సుగలవారై శ్వేతద్వీపంబును, పాలకడలిని, గజేంద్రునకు మోక్షమొసంగిన నాకిష్టమయిన యీగాథను, మేరుపర్వతమును, అందలి గుహాలను, ఉదపులను, వృక్షంబులను, నేను, బ్రహ్మయు, శంకరుండును విహరింపుచుఁ జేసెడి యీ పర్వతశిఖరములను, కౌమోదకియను గదను, కౌస్తుభమను పేరుగల నామణిని, నా సుదర్శనంబును, చక్రంబును, పాంచజన్యమను పేరుగల నాశంఖమును, లక్ష్మీదేవిని, ఆదిశేషుని, గరుడుని, వాసుకినిఁ, బ్రహ్లాదుని, నారదుని, మత్స్యకూర్మవరాహాద్యవతారంబులను, ఆయాయవతారములఁ జేయఁబడిన కార్యములను, సూర్యుని, చంద్రుని, అగ్నిహోత్రుని, ఓంకారమును, ధర్మమును, తపస్సును, సత్యమును, ఋగ్యజుస్సామాథర్వములనెడి నాలుగువేదంబులను, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పముననెడి యాఱు వేదాంగములను, శాస్త్రములను, గోవులను, బ్రాహ్మణులను, పతివ్రతలను, చంద్రునియొక్కయు, కశ్యపప్రజాపతియొక్కయు భార్యలను, (చంద్రునికి ముప్పదిమువ్వురు భార్యలు; కశ్యపునికి దితి, దనువు, అనాయువు, ప్రాధ, ముని, సురస, ఇల, క్రోధవశ, తామ్ర, కపిల, వినత, కద్రువ, కాల, లోప అను పదునేవురు భార్యలు) గంగ, సరస్వతి, యమున, సునంద మొదలగు పావననదులను,

దేవతలను, గల్పవృక్షమును, ఐరావతంబును, అమృతంబును, ధ్రువుని, బ్రహ్మర్షులను, పుణ్యచరిత్రముగలహరిశ్చంద్రుఁడు, కుచేలుఁడు, ప్రహ్లాదుఁడు మొదలగుభక్తుల చరిత్రములను బఠించుచున్నారో, అట్టివారికి నాయొక్క శాశ్వతలోకంబు నొసఁగెదను, అని చెప్పి శంఖం బూఁది పక్షులఱేఁడగు గరుడునెక్కి వైకుంఠమున కేఁగెను. వేల్పు లందఱు సంతోషభరితులైరి. అని చెప్పి శుకుండు పరీక్షిన్మహారాజుతో నిట్లనియె.

* ఫ ల శ్రు తి *

క. గజరాజమోక్షణంబును
నిజముగఁ బఠియించునట్టి నియతాత్ములకున్
గజరాజవరదుఁ డిచ్చును
గజతురగస్యందనములుఁ గైవల్యంబున్. 121

తా. గజరాజమోక్షణంబును శ్రద్ధతోఁ బఠించు, లేక విను జితేంద్రియు లగుమానవులకు, గజేంద్రునికి మోక్ష మిచ్చినభగవంతుఁ డేనుఁగులు, గుఱ్ఱములు, రథములు మొదలగు నిహలోకసుఖంబులను, మోక్షమును నొసఁగును.

క. జనకసుతాహృచ్చోరా
జనకవచో లబ్ధవిపినశైలవిహారా
జనకామిత మందారా
జనకాదిమహేశ్వరాతిశయసంచారా. 122

తా. సీతయొక్కవ్యసనమునుబాపినవాఁడవు, తండ్రియొక్కయానతిచే నడవులలోను, గొండలలోనుదిరిగినవాఁడవు,జనులకోర్కులఁగల్పవృక్షము వలె నొసఁగువాడవు, జనకుఁడుమొదలగు నృపాలురకుమీఱిన మంచినడత గలవాఁడవు నైన ఓరామా ! వినుము.

మాలిని:—

దివిజరిపువిదారీ దేవలోకోపకారీ
భువనభరనివారీ పుణ్యరక్షానుసారీ
ప్రవిమలశుభమూర్తీ బంధుపోషప్రవర్తీ
ధవళబహుళకీర్తీ ధర్మనిత్యానువర్తీ. 128

తా. రక్షస్సులను సంహరించినవాఁడవును, దేవతల కుపకారము చేయువాఁడవును, దుష్టులను సంహరించుటచే భూమియొక్క బరువును దగ్గించినవాఁడవును, పుణ్యకార్యములను జేయువారికి ననుకూలుఁడవును, మిక్కిలి స్వచ్ఛమైననల్లనిశరీరముఁ గలవాఁడవును, చుట్టాలను బోషించుటయందు శ్రద్ధగలవాఁడవును, తెల్లని విస్తారకీర్తిఁ గలవాఁడవును, ధర్మమునందు విడువని పట్టుదలఁ గలవాఁడవు నైనయోరామా! నీవవధరింపుము.

శ్రీమన్మహాకవి బమ్మెరపోతనామాత్యప్రణీతం బైన శ్రీమదాంధ్రభాగవతాష్టమస్కంధమునందలి ప్రతిపదటీకాతాత్పర్యసహితమయిన

గజేంద్రమోక్షము సమాప్తము.

వేంకట్రామ్ పవర్ ప్రెస్, పవరుపేట - ఏలూరు.